శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము ౩౨. { స్వభాను శ్రావణ—కార్తికములు. } సంచిక ౩-౪

## సంస్కృతబసవోదాహరణము.

పాల్కురికి సోమనాథకవి ప్రణీతము. (క్రీ. శ. 1220 ప్రాంతము.)

---

ప్రథమావిభక్తిః.

మాలిని. జయతు బసవరాజః ప్రాణలింగాత్మపూజః
శరణదివిజభూజః స్మేరసంవిత్సరోజః
[1]గణపరిషదధీశః ఖ్యాతదానావ[2]ధానః
సరసమహిమగానః స్వానుభూత్యైకమానః

కళిక - హరిగతిరగడ.

అపిచ పురాతననూతన శివగణపాదోదకపాలస దభిషేకః
తులితవిపల్లవ పల్లవ జంగమ లింగసమర్చన విచితవివేకః
సతతవికస్వరభాస్వరనిజముఖమండల ఖండితరజనీనాథః
కృతయుగవర్తన కీర్తనపరసః సుపవిత్రచరిత్రసనాథః
ప్రకటితదర్పకదర్పకరేణుక్రమథనసితికరాంకుశహేళః
శుకముఖమానస మానసకమలాకరవిహరణ చణరాజమరాళః
స్వానుభవాంచిత కూడలి సంగమ సంగతిదేవధ్యానాభిజ్ఞః
సూనృతభాషణభూషణ వాణీ సింహాసనగంభీరరసజ్ఞః

---

1. గర. 2. దాన.

ఉత్కళిక.

| | |
|---|---|
| తాపుళవారాట ధ్వనిసార | శ్రుతిముఖర స్వర సరస సమేత |
| శ్రీ విశ్రుతపేశల శారీర | స్మృతినికురుంబరసాయనగీత |
| వ్యతికర నానాగతి విస్సీమ | ప్రముదితహృద్వర్తన శితికంఠః |
| శ్రుతిసంధాయి చమత్కృతభూమా | శమదమలాలన గుణితోత్కంఠః. |

ద్వితీయా విభక్తిః.

శా. వేదాంతార్థరహస్యభేదవిశదన వ్యాపారపారంగత
ప్రౌఢప్రక్రియ వాక్ప్రపంచ రచనాచాతుర్యధుర్యాశయమ్
దైవాస్తిక్యనిదర్శనప్రతిభువమ్ తాపచ్ఛిదాపండితమ్
భాండాగార ధురీణమత్ర బసవామాత్యం కిమాంచక్ష్మహే.

కళిక - ద్విరదగతిరగడ

అపిచ కరతలయుగళ విహితపురహరయజన
మవహితకరణసతత పరిముదితశరణజన
మహిమకర శశిసరణి విముఖనిజపవనగతి
మహిపరిమ దధిపుష్ప వివిధమధురిమసుమతి
మతులకరిహరి కనకమణిగణగుణిత విభవ
మతివిమమ బహుళతరభవజలధికలశభవ
మమల నిజహృదయ కృతపరిచయవిదనుభవమ్
శమితనిరవధికకలివృజినసహచరభవమ్

ఉత్కళిక.

| | |
|---|---|
| నిరతిశయ జనదురిత | సకల యమిజన విమల |
| నిరసన నిపుణచరిత | [1]వికసితహృదయ కమల |
| ఘనవిషయ రసవిముఖ | పరికలన మధుకరం |
| సనక శుకజనకముఖ | శరణజన శివకరం |

1. వికలిత.

తృతీయావిభక్తిః.

శా. ఆస్థానే శివనాగసంయమిః కరద్వంద్వాంగుళి శ్రేణికా
లీలాలాలన మంథనా దజనయత్ యః క్షీరధారావళిం
తే నాత్యద్భుతకర్మకర్మఠ మహామాహాత్మ్యవర్ధిష్ణునా
భాండాగారధురంధరేణ బసవామాత్యేన కః స్పర్ధతే.

కళిక - తురగవల్గనరగడ.

అపిచనిగమసారభూతవీరశైవదీక్షితేన
తపనశత సహస్రసదృశ దేహదీప్తిలక్షితేన
ఖండిత ప్రసూనవిశిఖచాపదండలస్తకేన
మండితానుభావశరణచరణకలితమస్తకేన
విదళితప్రచండ వివిధ విషమ విషయగర్జితేన
హృదయవివర [1] నివసనప్రగాఢ లౌల్యవర్జితేన
నీలగళవిశిష్ట భక్తభవన పుష్యదిందిరేణ
భాలనయన విమలహృదయ కమలమధ్యమందిరేణ

ఉత్కళిక.

యావనాళ రాశినిహిత    సాంగ భక్తవృషభనిత్య
భూవినుత కటాక్షమహిత    రంగ వల్లినియమకృత్య
శక్తివైభవాభి జాత    దృష్టసాద్భుత క్రమేణ
మౌక్తిక ప్రదానసీత    దుష్టదళన విక్రమేణ.

చతుర్థీవిభక్తిః.

శా. వేదాంతోదిత వీరశైవసమయాచార ప్రతప్రక్రియా
చర్యాదేశిక సార్వభౌమ మహిమభ్రాజిష్ణవే జిష్ణవే
భాండాగారధురంధరాయ బసవామాత్యాయ చేతస్సదా
జాగ్రత్కూడలి సంగమేశ్వరమహాదేవాయ తస్మైనమః.

---

1. శివతంత్ర.

కళిక - హరిగతిరగడ.

అపిచగౌతమ కణాదకుంభజచ్యవనముఖ్య [1] ముని (లబ్ధ) సద్మనే
తపనవహ్ని హిమభానులోచన త్రిపురవైరిగణభావితాత్మనే
కరతలస్థ నిఖిలాండమండలి [2] ప్రకటకందుక సదావిహారిణే
కరటిదైత్యఘనతుంగ మస్తకకీలితమౌక్తిక నికాయహారిణే
కుసుమ బాణశితబాణ [3] సంహతిగ్రసనధీర గుణసారశోచిషే
వసుమతీప్రముఖ భూతచేతన [4] ప్రదదయామయ కటాక్షరోచిషే
వితతపాతక సమూహసాను మద్వితతి నిర్దళనవజ్రబాహవే
శ్రుతిసముత్కర సదావిరోధ కృశ్చనుయ బౌద్ధముఖచంద్రరాహవే.

ఉత్కళిక.

రుచిరరత్న మహనీయహాటక
ప్రచుర [5] యాప జవనత్వ ఘోటక
త్వరితభూత సృణి పాతధారణ
క్షరిత దాన జలగంధవారణ
[6] ప్రథితవస్తు పరిషన్నిరంతర
ప్రదమహా మహిమకారణాంతర
స్మితపరిస్ఫురిత భక్తచేతసే
స్తుతివచోముదిత వహ్నిరేతసే.

పంచమీవిభక్తిః.

శా. చేతః కీలితసంగమేశ్వర మహాదేవాలికప్రస్ఫుర
జ్జ్వాలా జాలజటాల వహ్నిశలభాకారప్రసూనాంబకాత్
భాండాగార ధురంధరాద్బసవ నామాత్యా [7] (త్సువర్ణావళీ)
చూడాఘృష్ట పదారవింద యుగళాన్నైవాపరందైవతమ్.

కళిక - హరిగతిరగడ.

అపిచజగత్త్రియ కర్ణసుధారస కుల్యాంచితసూనృతజల్పాకాత్
కుపితాంతర్గత రిపు [8] షడ్వర్గమహోత్కట మస్తకతట కుట్టాకాత్

1. మునిసత్త. 2. లిత్కనక కందుకవద్విహారిణే. 3. సంహృతి. 4. చేతసా యుత. 5. ప్రచయ 6. ప్రథమశాంభవాంత కరణాంతర. 7. (మాత్య...వళీ) -క. 8. షడ్వర్గామ (సు) ందర.

పరవనితాజన భాసురతర ముఖమండలవీక్షణ విధి జాత్యంధాత్
నిరతిశయానుగ్రహాశిత ఖడ్గలతాపాటిలూన పునర్భవబంధాత్
కన్నడబ్రహ్మయ్య కరుణాదుగ్ధార్ణవసంవర్ధన రాకాచంద్రాత్
కిన్నరబ్రహ్మయ్య పురహరగోష్ఠీసల్లపనాకర్ణన నిస్తంద్రాత్
లాలిత సకలపురాతన గణవాఙ్మణిముకురప్రతి బింబితరూపాత్
లీలాలాలస రసమణి చంచలనయనాంచల శితవిశిఖదురాపాత్.

ఉత్కళిక.

ఆశాజల సుతశిఖి సమూహ వ్యాధి పటిమదుత్తుంగతరంగ
క్లేశతిమింగిల మిత్రగ్రాహ క్రోధవిజృంభణ ఘోరభుజంగ
స్వకళత్రసముత్కరనవఫేన స్ఫారదురుతరభవజలధివహిత్రాత్
ప్రకటితబాంధవ మండలమీన దురిత లతాచయలవన లవిత్రాత్.

షష్ఠీవిభక్తిః.

శా. చిద్వ్యోమ స్మయమాన శీతకిరణోద్యోతత్సుధామాధురీ
నిర్వృత్తిస్నపనప్రమోద భరిత శ్రీ నీలకంఠాత్మనః
ఉన్మీల ద్గుణరత్నరోహణ మహాశైలస్య తస్య ప్రభోః
భాండాగార ధురంధరస్య బసవామాత్యస్య దాస్యం భజే.

కళిక హరిగతిరగడ.

అపిచశరనీహార హారమలయజభసిత సితదివ్యదేహస్య
కుకథచరదుర్భావ భావభవమదవిహృతివిహృదిసుసన్నాహస్య
సంగమేశ్వర విహిత హితమధుర సంగీతగీతానుభావస్య
జంగమ మనస్సంగ సంగతేహాదావ దావప్రభావస్య
[1]భక్తిమహిళాశ్లేష జనితమేదుర విపులపులకసంయోగస్య
ముక్తిసౌఖ్యాధాన దానవిద్యానిరత రతమహోద్యోగస్య

1. శాకుదబాద (భాళిన)

పరిచిత సుధాసార సారమధురిమనికృతి కృతిచణ వచస్కస్య
ధరణి దిగ్వియదతల తలః బిడ శశికరనికరనిభయశస్కస్య.

ఉత్కళిక - ద్విరదగతి.

నిటలలోచన భక్తవాత్సల్య కల్యాణ
కటక సీతావాస నిస్సీమ కల్యాణ
గోచరాంచితవపుర్విస్ఫూర్తిముడివాల
మాచయప్రభు దీర్ఘనయనాంచితోత్కళ
కోపప్రసాద (భాజన)తా విధాక్రాంత
దీపిత ప్రథమానభక్తి వినయాత్యంత
భారవైదిక సువిశ్రుత శివాచారస్య
సారజంగమసూక్తిమణి కర్ణపూరస్య.

సప్తమీవిభక్తిః.

శా. ఓంకారాంకురి వేదపల్లవలసత్పంచాక్షరీమంజరీ
తత్త్వామోద నితాంతలబ్ధశరణా [1] నీకేద్ధ పుష్పంధయా
యానౌ నాదలతా తదీయసు [2] షమా రామాభిరామస్థలే
తస్మిన్ శ్రీబసవాహ్వయే గుణనిధౌ కింవా నలోకోత్తరం.

కళిక - మధురగతిరగడ.

అపిచాధార సురంగ జ్ఞాతరి
సుపథపథిక చిత్సుఖసంధాతరి
వర్గచతుష్టయ దాపన శీలిని
దుర్గతి నిరసన కరుణాశాలిని
శరణపదాబ్జ పరాగలలామని
దురితనిరాస ధురంధర భూమని
వేదవిరుద్ధాచార పరిద్విషి
నాదసుధా ప్రీణిత పురవిద్విషి.

---

1. నీకోద్ధ. 2. షిమహా.

ఉత్కళిక

సురగిరి మందర
నిరుపమ కందర
ఘనతర చందన
వనచయనందన
మహిళా సహచర
విహారత ఖేచర
లాలిత నామని
కీలిత సామని

సంబోధనవిభక్తిః.

శా. మూలాధార వికస్వరాంబుజవనీమధ్యస్ఫురద్వీథికా
యాతాయాత వినోదపేశలమతే! చిద్వ్యోమశీతద్యుతే!
సంసారార్ణవ కర్ణధార! కృపయా మాం పాలయ ప్రత్యహం
భాండాగారధురంధరేశ! బసవామాత్యేశ చూడామణే.

కళిక - ద్విరదగతి.

అపిచపాలిత వీరశైవవ్రతాచార
కృపణజనరక్షణ కృతచరణవ్యాపార
సితయశఃకర్పూరవాసితబ్రహ్మాండ
మితిరహితకిల్బిషాంబుజమండవేదండ
భుజగవరసుర గరుడ ఖచర కిన్నరసాధ్య
నిజగుణశ్రవణతోషిత పండితారాధ్య
శతమఖతరుస్ఫీత గణపోషసముత్కంఠ
తతవితతఘన సుషిరకీర్తితశ్రీకంఠ.

ఉత్కళిక.

శుకముఖ మనోగమ్య
వికచగుణ గణతామ్య
దల్లమప్రభు సత్య
సల్లపన సాంగత్య
సాధిత స్వాత్మావ
బోధ నిజసద్భావ
శివతత్త్వ విస్తార
భక్తిపథనిస్తార.

సార్వవిభక్తికమ్.

శా. యస్సంగీత నిధిః యమాహురభవం యేనార్చితమ్ సూనృతమ్
యస్మై స్వస్తి యతస్తదీయము దభూత్ యద్వీరశైవ వ్రతం
యస్యాపాంగసహోదరీచ కరుణా యస్మిన్మహత్త్వాధికం
సత్వం త్రీణి జగంతి పాహి బసవామాత్యేశ చూడామణే!

ఆర్యా: శ్రీ బసవరాజ గుణమణి
ఖచితం జయతాత్ సువర్ణ మేతత్
సోమసుకవినా రచితం
హృదయాభరణం సదాముదాహరణమ్.

---

ఈ సంస్కృత బసవోదాహరణము పాల్కురికి సోమనాథకవి రచిత గ్రంథములలో సముద్రితములై నిలిచినవానిలో నొకటి. సోమనాథుఁడు సంస్కృతమునను దెలుఁగునను నొక్కొక యుదాహరణము రచించినాఁడు. తెలుఁగు[1] బసవోదాహరణ మీవఱకు ముద్రితము. సంస్కృతోదాహరణ ముద్రణమున కిదియే ప్రథమము. చెన్నపురి ప్రాచ్యలిఖితభాండారమునందలి మాతృక ననుసరించినప్రతిక యాధారముగా దీనిఁ బ్రకటించితిమి. ఇందు పెక్కు లేఖక ప్రమాదములు కలవు. మాకుఁ జేరినవ్రాఁత ప్రతియందును బెక్కుదోషములు కలవు. ప్రత్యంతరము కొఱకుఁ బ్రయత్నించుచున్నారము.

సంస్కృతమున నుదాహరణము లతిప్రాచీనకాలమునుండి యున్నట్లు దెలియవచ్చినను మనకు లభించినవి రెండు మూఁడని మాత్రమే చెప్పనగును. [2]వానిలో నిది ప్రాచీనము. సంస్కృతముననున్నను, తెలుఁగునగల యుదాహరణలక్షణములు కలిగియుండుటచేతను, తెలుఁగుకవియగు సోమనాథుని కృతియగుటచేతను, లఘుకృతియయ్యును వీరశైవమతమునకు సంబంధించిన గ్రంథ మగుటచేతను యథామతి సంస్కరించి యాంధ్రసాహిత్యపరిషత్తువారి కోరికపై యిందు ప్రకటించితిమి.

కృతి ప్రాచీనమైనది కావున మాసవరణలయందలి గుణదోషములఁ దెలిపిన సాదరపూర్వకముగ నందుకొందు మని మనవి.

బండారు తమ్మయ్య,
*నిడుదవోలు వేంకటరావు, ఎమ్. ఏ.

---

1. ప్రభవ మాఘభారతిలోఁ బ్రభాకరశాస్త్రిగారిచేఁ బ్రకటితము.
2. సిద్ధరాముని సంస్కృతోదాహరణము.
చూడుఁడు. (ప్రభాకరశాస్త్రులవారి బసవపురాణపీఠిక. పుట 64.)
ఓరుగంటి రామకవి కవికాలక్షణసారమున నుదాహరణభేదములు.

# కవిహంస.

ఆకుండి వెంకటశాస్త్రి.

---

కం. కందములు విడక సరసిజ
మందగతులు వెలయ మధురమధుమృదుగీతా
నందభ్రమరవిలసితము
లంది చరించెద వదెంతో హాయిగ సుకవీ!

కం. కొందల మదేల నీ కే
పందలు త్వన్మధురగళరవంబుల కీర్ష్యం
జెందినఁ, గానీ యొరు లభి
నందింతురు నిన్ను నది ఘనమె గా సుకవీ!

కం. అంద మగుఁత్వత్పదక్రమ
మందలి యొప్పిదము కుకవులరసి, యరసికా
మందదురూహలచే నిను
నిందించిన నేమిలోటు నీ కో సుకవీ!

కం. కలిమి గలుగువసతులలో
మెలఁగెదు రుచ్యములు మిగుల మృదులము లగుభు
క్తులు గోరి పెద్దవారిం
దొలఁగెదు సన్మానసవిహృతులకై సుకవీ!

కం. కవి వీ వగుటనె యాదిమ
కవి యగునానలువ ప్రీతిఁ గాంక్షించిననిం
దవులుట వాణికి సాజం
బవ్వఁగా గతిహితులహితము నరయుట సుకవీ!

కం. కోమటిబిడ్డల మెతుకుల
గావి డిగ్గై గోము గనిన కాకవి నిన్నుం
తే మించఁగఁ బరువులిడం
గా మెచ్చున తెలివి గలజగ మ్మోసుకవీ!

కం. భూరమణులఁ జేరి తదుప
కారముగా వాఁసుగుణగణ మందందుం
బేరుకొని వారలబహూ
కారము లెన్ననిఁ గాంతు గాదే సుకవీ!

కం. కలగుణదోషము లెంచం
దలఁచినఁ గొనవలయుఁ ద్వత్పదమె వేఱుగ ని
మ్ముల నీరక్షీరములం
తెలిపెడినే ర్పంతయుం ద్వదీయమె సుకవీ!

కం. మందపవమానతుందిల
నందనచందనమరందసవ్యామృతని
ష్యందిభవద్రవములఁ జెవు
లం దనుపనివాఁడు భువి గలండే సుకవీ!

కం. సరసుల విపనాడక భా
స్వరపదవృత్తులును మృదులశయ్యయుఁ దగ మా
ధురిగలవారిన పొగడుచుఁ
జరియించెద వెంతభాగ్యశాలివొ సుకవీ!

కం. కుందకు, కుకవికులము నీ
కుం దగునున్నతపదంబుఁ గూర్పదనుచు నీ
కుందనమువంటికీరితి
కిం దులవచ్చున రొకించుకేనియు సుకవీ!

# హల్లోహలము.

నిడుదవోలు వేంకటరావు

---

మనుచరిత్రలో.

కం. ఉల్లలదలకాజలకణ
పల్లవితకదంబ ముకుళపరిమళలహరీ
హల్లోహల మదబంభర
మల్లధ్వనులెసఁగ విసరె మరుదంకురముల్. (2-6)

అను పద్యమున టీకలో 'పరిమళలహరీ-సౌరభ ప్రవాహమున ఈహాత్-అభిలాష గలవగుచున్నట్టియు లోహల-అవ్యక్తధ్వనులుగల, మదబంభర-మదించినగండుతుమ్మెదలయొక్క ధ్వనులు అనికలదు.

కాని పైవిధముగ 'పరిమళలహరి+ఈహాత్+లోహల' అని పదచ్ఛేదముచేయుట సరికాదనియు, 'హల్లోహలము' అను నేకపదమే యనియు నీక్రిందిప్రయోగములు తెలుపుచున్నవి.

1. భాగవతము దశమస్కంధము-పూర్వభాగమునఁ బోతన-

కం. ఉల్లసితకుచ భరంబుల
సల్లాడెడి నడుముతోడ నలరులదండన్
ఝల్లియొకతె హరికిచ్చెను
హల్లోహలకలిత యగుచు నంగసకంటే. (793 పద్యము)

హల్లోహలపదము నుపయోగించినాఁడు-(ఇచట 'ఈహాత్+లోహల అని పదచ్ఛేదము చేయు వీలులేదుకదా!)

2. తెనాలిరామకృష్ణకవి పాండురంగ మహాత్మ్యమున-

శా. సాహిత్యాపరకాళిదాస! హరిపూజాగౌరవవ్యాస! గం
గా<u>హల్లోహల</u> వాగ్విలాస! రిపువర్ణత్రాసకృత్త్రాస! కాం

తాహార్హాహాపదృగ్విలాస ! శ్రుతిపద్యామోజితాభ్యాస ! హి
మూహార్యోపమ ధైర్యధుర్యపదవిన్యాసా ! విధేయారసా."

అని చతుర్థాశ్వాసాంతమునఁ గృతిపతి సంబోధించియున్నాఁడు.

3. ధరణిదేవుల రామమంత్రి దశావతార చరిత్రమున-

మ. ఖలనిద్రాననచుంబనావసర దృష్టిశ్రీకపోలస్ఫుర
త్పులకవ్రీడితముగ్ధ కోకకుచ సభ్రూభంగమధ్యాధర
స్థలదంతక్షతకేళికాపరమనోజాత ప్రగల్భాంగనా
కలనాదోదిత పాహిపాహిముఖవాక్యల్లోల హల్లోహలా.

అని నవమాశ్వాసాంతమునఁ జెప్పియున్నాఁడు-

4. శ్లేషయమక చక్రవర్తి వేంకటాచార్యకవి అచలాత్మజాపరిణయమునఁ బ్రథమాశ్వాసమున.

శా. మల్లీవల్లిమ తల్లివల్లరులలో మల్లోప మల్లోపమో
ద్యల్లీలోల్లుఠనంబునం బెనఁగుచున్ హల్లోహలోల్లోలమై
యల్లంబిల్లిగనుల్లసిల్లెడి యళుల్ హల్లీసకోలాసక్ర
ఝ్ఝల్లీఝిల్లకగీతి కల్లడ నుతుల్ చెల్లీనునప్పుట్టునన్.

(41. పద్యము.)

అని యుపయోగించినాడు.

5. ఓగిరాల రంగనాథకవి ద్విరేఫవర్ణ దర్పణమున.

కం. అక్షుద్ర భావనాశా
విక్షేత్ర కృపాఝులఝ్ఝురీ కల్లోలా
నుక్షణ హల్లోహల నిజ
వీక్షణ గుణసత్పథప్రవృత్తో ర్ధర్తా.

అని చతుర్థాశ్వాసాంతమున వాడియున్నాఁడు.

పై ప్రయోగములవలన హల్లోహలమనునది యేకపదమని నిశ్చయమైనది. ఈపదము సమానగతమైయుండుటచే నిది సంస్కృతపదమని గ్రహింపఁదగును. అయినను సుప్రసిద్ధసంస్కృత నిఘంటువులలో నీయఁబడినట్లు కానరాదు

తెలుఁగు కావ్యములలోఁ బ్రయుక్తములైన సంస్కృతపదములను బెక్కింటిని చూపిన 'సర్వశబ్దసంబోధినియందీ' పదము కానరాలేదు. తెలుఁగు నిఘంటువులలో బ్రౌనుదొరవారి నిఘంటువునమాత్ర మీపదము కానవచ్చుచున్నది. వారి యింగ్లీషు - తెలుఁగు నిఘంటువులో (1291 పుట.) నీపదము హల్లోహలముగా గ్రహింపఁబడి దానికి తొట్రుపడ్డ, చీకాకుపడ్డ (Bewilbedened stumbled) అను నర్థములతో నుండి, మనుచరిత్రలోఁ బై పద్యమే యుదాహరణముగా నొసగఁబడినది. అందే దశావతార చరిత్రమునఁగల ప్రయోగము 'హల్లోహలుఁడుగా గ్రహింపబడి యిట్లర్థము వ్రాయఁబడినది.

"వాక్కల్లోల-వాక్యములనే మహత్తైన అలలయందు హల్లోహల తొట్రుపడుతూ ఉండేవాఁడా అనఁగా మునుగుతూ తేలుతూ ఉండేవాఁడని భావము".

బ్రౌనుదొరవారీ పదమును మనుచరిత్రమున నేకపదముగా గ్రహించి తమనిఘంటువునం దిచ్చెను, వారికాలముననే యనఁగా. క్రీ. శ. 1851 లో ముద్రితమై, వారియాజ్ఞానుసారముగ శ్రీ. జూలూరి యప్పయ్యపండితులు వ్రాసిన టీకలో 'ఈహత్ + లోహాల' అని పదచ్ఛేదము చేయుటయు నర్థము వ్రాయుటయు పరస్పర విరుద్ధముగ గన్పట్టుచున్నది- దీనికిఁ గారణము జూలూరివారి టీకారచనమునకుఁ దర్వాత యిరువదేండ్లకు దొరవారి నిఘంటుప్రకటనము జరుగుటయేయని యూహింపఁదగియున్నది.

పాండురంగ మహాత్మ్యమున టీకలో 'హల్లోహల-ప్రవాహము వంటి'అని కలదు-

'అచలాత్మజాపరిణయము'న టీకలో- హాల్లోహాల మత్తతచేతను; 'ఉల్లోలము-మిక్కిలి చంచలించుచున్నది' అని కలదు-

ద్విరేఫవర్ణదర్పణమున 'హాల్లోహాలైర్నగోన్నగ్నైః' అని కలదు-

పై విషయములఁ బరిశీలింప నిది హాల్లోహాలమను ప్రత్యేకపదమనియుఁ దీనికి, మునిఁగి తేలుట, తొట్రుపడుట, చీకాకుపడుట ప్రవాహము, మత్తత-మగ్నోన్మగ్నము అను నర్థములతోఁ గావ్యముల వ్యవహరింపఁబడినదనియుఁ దెలియవచ్చుచున్నది.

యతిప్రాసములలో హాల్లోహాల పదస్వరూపము వ్యక్తమగుచునే యున్నది.

ఉదాహృతపద్యములలో 'అల్లింబిల్లి' ఝుంఝుమీపదములు గమనింపఁదగినవి.

పదార్థవ్యుత్పత్తులకొఱకు పండితుల కిది నివేదితము.

# హాస్యరేఖ.

వ్యాకరణవిద్యాప్రవీణ-విద్వాన్. చిలుకూరి పాపయ్యశాస్త్రి.

సీ. నవ్వెఁ గాననమునఁ బువ్వు లాయచ్ఛభా
            చిత్రదర్శనమునఁ జెన్నుమిగిలి
పరికించి మైథిలీవదనపద్మమునందు
            మందస్మితాంచితమధురరేఖ
వికసించెఁ గొమ్మల విమలకోరకములు
            నామోదభారంబు నమరఁ దాల్చె
గణియింపఁ దొడఁగెను గంధవాహుఁడు విరు
            లేవేవి విరిసె నెయ్యెడల ననుచు

గీ. సరగ మేల్కాంచి మత్తపుష్పంధయాళి
చెవుల గుసగుసలాడుచుఁ జేరికొనియె
నొక్కటొక్కటిగాఁగ నాచక్కటికిని
మధురదృశ్యదిదృక్షు ముమ్మరముగాఁగ.

సీ. నాటకంబున వచ్చునవ్యదృశ్యంబులఁ
            దిలకించురసికాళి ద్విజగణంబు
శాఖాసనంబులఁ జక్కఁగఁ గూర్చుండి
            మధురరసాస్వాదమగ్నులైరి
అంతలో వైశమే యభినయారంభంబు
            లక్షింపఁ గోలాహలము చెలంగె
పంచవటీక్షేత్రభాసురరంగంబు
            ప్రియభావసంపత్పరీత మయ్యె

గీ. సీత పరికించె నవ్వు దాచిన్నలాఁడి
దిరిగి చూచెను లక్ష్మణధీరు నచట
మఱియు నిర్వురనడుమను మధురహాస్య
రేఖఁ గీలించి పలికెను ప్రేమమీఱ

ఉ. ఎంతటి నిష్ఠురత్వము వహించితివోయి మఱంది నీవు; గా
వింతుర గేహసీమలను విందుల కిట్లవమాన మెచ్చటన్ ?

కంతు మెలర్ప నిన్వలచి ప్రాణసమానునిగాఁ దలంచు నీ
యింటికి నన్యపూరుషుఁడ నే ననుచున్ వచియింప నొప్పునే.

ఉ. యాచకుఁ జిన్నపుచ్చి పరియాచకముం బొనరింప హెచ్చుసం
కోచము చెందు; నీకుటిలకుంతల చిన్నిట నాశ్రయింపఁగా
వేచుట లేదు సర్వమును వేగమ యర్పణసేయ వచ్చె; సం
కోచ మి దేల? నీకుఁ గయికొంటయొ; యిచ్చుట లేదు సుంతయున్.

ఉ. జానకిపాదపద్మములఁ జాఁగిలి మ్రొక్కె సుమిత్రసూనుఁ డా
మానిని దీవనల్ నొసఁగి మందశుచిస్మిత మొప్పఁ బల్కె నే
నూనినవేడ్క నో మఱఁది! యొప్పుగ వింటిని మీదుపల్కు లో
రా! నయ మొప్ప నూత్నశుకరంభల కెప్పటినుండి వాదమో?

ఉ. పిమ్మట బాలతోఁ బలికెఁ; బేలవు కాకుము నామఱంది! యె
ప్డిమ్మెయివాఁడె; యెన్ని వచియించినఁ బెంకితనంబు నూని నూ
త్నమ్ముగ వచ్చినట్టిచెలిఁ దానయి యింటఁ బరిత్యజించి పం
త మ్మెదఁ దాల్చి వచ్చె నిది ధర్మమె యిట్టివిరాగ మూనుటల్.

ఉ. కోరదవేని నీ వితని గోమలి! యొప్పఁగఁ జేయుదాన; నీ
వారట మందకమ్మ మన మారసి వీని వరుం బొనర్తు భా
మా! రహి నీకు; నైనను నమందసమృద్ధిసమేత వీవు; ని
స్సారులమై యరణ్యమున సారెకు వేసరుచుంటి మీగతిన్.

ఉ. స్వామికి దాసినై యిచట సల్పెదఁ గాపుర మేను గాని యో
భామిని! నీకు సేవనులభారము కొంచెము గల్గనీను; నీ
కోమలహస్తపద్మములకుం గయిసేఁతభరంబు గూర్తునే?
కామిని కోర్కితీఱ నొడికంబున నేన యలంకరింపనే?

గీ. కాని యొక్కటి మన్నింపఁ గలదు నీకు
నేను పెంచిన పశుపక్షినికర మొకట
కొంచెతనమునకై దొరఁకొనెడివేళ
వానిఁ బ్రేముడి సహియింపవలసియుండు.

(పంచవటి యనుకావ్యమునుండి.)

# బాలవ్యాకరణము, గుప్తార్థప్రకాశిక.

(ప్రథమసూత్ర వివరణ పర్యాలోచనము.)

వ్యాకరణవిద్యాప్రవీణ - విద్వాన్
దర్భా సర్వేశ్వరశాస్త్రిగారు.

"ఆంధ్రదేశంబున వాడఁబడుభాషకు నాంధ్రభాష యని పేరు. భాష యనఁగా జనులు పరస్పరాభిప్రాయములను దెలియఁజేసికొనుటకు సాధనంబులై యనాదిసంకేతంబులైన ధ్వనులు. ఇయ్యది వాగ్రూప మనియు లిఖితరూప మనియు ద్వివిధము" ఇత్యాదికము గుప్తార్థప్రకాశిక యందుఁ గలదు.

భాష ధ్వనిరూప మని పైగ్రంథముంబట్టి స్పష్ట మగుచున్నది. కాన "ఇయ్యది వాగ్రూపమనియు లిఖితరూపమనియు ద్వివిధమూ" అను వాక్యము చింత్యము. లిపియనునది కలము మొదలగు వానితో వ్రాయు గీఁతలుకాని భాష కాదు. ఈగీఁతలు భాషకు స్మారకములు, అనఁగా భాషయొక్క స్మృతిని గలిగించును. స్మృతమైన యాభాష అర్థబోధక మగును. గీఁతలు ధ్వను లెట్లగును? గీఁతలు చక్షురింద్రియజన్యప్రత్యక్ష విషయములు, ధ్వనులు శ్రోత్రేంద్రియజన్య ప్రత్యక్ష విషయములు గదా! ఇట్లు భిన్నేంద్రియగ్రాహ్యము లగునీరెండును నేకత్వమును బొందఁ జాలవు. లిపిగూడ భాషయే యని తుష్యతుదుర్జనన్యాయమున నంగీకరించినయెడల నాంధ్రలిపియందున్న రఘువంశము వే అనియు నాగరలిపియందున్న రఘువంశము వే అనియు కర్ణాటలిపియందున్న రఘువంశము వే అనియు జెప్పవలయును. అవి మూఁడును భిన్నములేని, కాళిదాసకవి దేనికి కర్త? మూఁడింటికిని కర్త యందుమా! కాళిదాసకవి మూఁడు రఘువంశములు చేసె నని యొప్పుకొనవలసినవార మగుదుము. ఇట్లనుట మిక్కిలిహాస్యాస్పదము: లిపి భాష యనుట వైయాకరణ నైయాయిక మీమాంసకాది సకలమతములకును విరుద్ధము.

"శ్లో. కంఠ్యావహౌ విచుయశా స్తాలవ్యా ఓష్ఠజా వుపూ".

అని వైయాకరణులు వర్ణములకు కంఠ్యాదిస్థానములను మాత్రమే చెప్పిరి. లిపి గూడ భాషయని వారి కభీష్టమైన యెడల, తాటాకో కాగితమో కలమో మఱి యేదియో ఉత్పత్తిస్థానముగ జెప్పియుందురు. తార్కికులును

శ్లో. శబ్దో ధ్వనిశ్చవర్ణశ్చ మృదంగాదిభవో ధ్వనిః
కంఠసంయోగాదిజన్యా వర్ణాస్తే కాదయోమతాః.
సర్వశ్శబ్దో నభోవృత్తిః శ్రోత్రోత్పన్నస్తు గృహ్యతే.

అని చెప్పిరి. మీమాంస మున్నగువానియందును గూడ నిట్లేకలదు. కొన్నిపట్ల కావ్యాదిలంపు స్మర్యమాణస్మారకములకు లాఘవాద్యనురోధముచే నభేదవివక్ష చేసినను జేయవచ్చును.

- సూ. సంస్కృతభాషకు వర్ణంబు లేఁబది. ౧

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః. క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ. ఇందకారాదులు అచ్చులు. కకారాదులు హల్లులు అజ్ఝల్విభాగ మీలాగుననే మీఁద నెఱుంగునది అని బాలవ్యాకరణమునఁ గలదు.

సంస్కృతభాషయందుఁగల ప్లుత జిహ్వామూలీయోపధ్మానీయేషత్స్పృష్టయకారాదులనుగూడ లెక్కింపఁగా సూత్రమునందలి యేఁబది యనుసంఖ్య యెట్లు సమంజసమగును ? వివరణమునందు ఈప్లుతాదులను జేర్పకయుండుటయుఁ జింత్యమే. ఇందులకు శ్లో. త్రిషష్టిర్వా చతుష్షష్టి ర్వర్ణాః ...అనుపాణినీయశిక్ష ప్రమాణము. (=సంస్కృతభాషయందు అఱువదిమూఁడు లేక అఱువదినాలుగు వర్ణములు గలవు అని భావము) అఱువదినాలుగులో నేఁబది కలవు గాన సూత్రమందలి యేఁబది యనునది శతేపంచాశన్న్యాయమున సమాధేయ మని చెప్పుటయు నిట్టిపట్టుల హాస్యాస్పద మగును ఈషత్స్పృష్ట ఋ కార ఌ కారములకు దుస్స్పృష్ట మని పేరుగాన దుస్స్పృష్టమని యఖండముగ లెక్కించిన నఱువదిమూఁడును పై ఋ కార ఌ కారములను భిన్నముగా లెక్కించిన నఱు

పదినాలుగును వర్ణములని పైకారికలోని వాక్యార్థ మని యెఱుఁగునది. "ఆంధ్రభాషలో నుపయోగించు సంస్కృతభాషావర్ణములను మాత్రమే చిన్నయసూరిగారు చెప్పిరి గాన ప్లుతాదులను జెప్పకపోవుట తప్పు కాదు" అని చెప్పినయెడల "మనఃక్షోభము, దుఃఖము" అనునవి తెనుఁగున వాడఁబడునవియే గాన దోషము తప్పదు. శ్లో. ఆద్యాయాః పంచాశద్వర్ణాః" అని చింతామణియు, శ్లో. ద్విధాకపచౌ నుస్వారో విసర్గః షోడశ స్వరాః, స్పర్శా అంతస్థ ఊష్మాణ శ్చతుస్త్రింశ ద్ధల స్స్మృతాః" అను వృద్ధకారికయు పైసూత్రమునకుఁ బ్రమాణ మని చెప్పినయెడల 'బాధే దృఢే న్యసామ్యాత్కిం' మనెడి న్యాయము స్మృతికి వచ్చుచున్నది. శ్లో. బాధే దృఢే న్యసామ్యాత్కిం దృఢేన్యదపి బాధ్యతామ్, అని న్యాయము. గ్రంథమునందుఁ జెప్పఁదోషము దృఢమా? అదృఢమా? అనివిచారించునపుడు దోషము అదృఢమైనయెడల నసఁగా వాస్తవముగాఁ బ్రమాణసిద్ధము కానియెడల గ్రంథాంతరప్రదర్శనము వ్యర్థమే! దోషము దృఢమైనయెడల నసఁగాఁ బ్రమాణ సిద్ధమైన యెడల అట్టి దోషసహితమైన దాని నెవ్వరు చెప్పినను మన కగ్రాహ్యమే యని పై న్యాయమున కర్థము. ప్లుతాదులు సంస్కృతభాషయందు స్పష్టముగా నుండఁగా లే వని చెప్పిన చింతామణ్యాదులును గ్రాహ్యములు కా వనియే నాయభిప్రాయము. సంస్కృతవ్యాకరణ సుప్రసిద్ధములగు జాతి వ్యక్తి పక్షములనాశ్రయించి సమాధానము చెప్పుట యశక్యము. హ్రస్వాకారము లన్నియు అభివ్యక్తివిబట్టి భిన్నములుగాఁ గన్పట్టినను వాస్తవముగా వర్ణముమాత్ర మేకమే. ఇట్లే దీర్ఘాకారాద్యచ్చులు కకారాదిహల్లులు నని దీక్షితాభిమతవ్యక్తి పక్షము. ఈమతమున ప్లుతాదులను జెప్పమి సూరిగారికి న్యూనత. ప్రత్యుచ్చారణం వర్ణభేదః (=అకారాదు లుచ్చరించునపుడు పుట్టునవి గాన భిన్నములు) అని నాగేశాభిమతవ్యక్తిపక్షమున అకారవ్యక్తులే అనంతములుగాన ఏఁబది యనుటయు నసమంజసమే. జాతిపక్షమున హ్రస్వదీర్ఘప్లుతములయం దుండెడి యత్వజాతి యొక్కటియే గాన అ ఆ ఇ ఈ అని దీర్ఘోద్రేకము వ్యర్థమే. ఈవిషయమున నిరూపింప వలసినవిషయము చాలఁ గలదు. వ్యాసవిస్తరభీతిచే విరమించితిని.

ఋ ౠ ఌ ౡ. వివృతదీర్ఘమగు నీ ౡ కారము నుపదేశించి ౡ కార మని యుదాహరించుట న్యాయము కాదు. అనుకరణమునందు సర్వవర్ణములును సాధువు లని ఋ ఌ క్సూత్రభాష్యమునందు చెప్పబడినది గాన ననుకరణమునందు సాధువులగు వర్ణముల నుపదేశించుటకుఁ బూనుకొనుట సముద్రమునకు సేతా మెత్తుటయే. మఱియును ఈౡకార మీషత్స్పృష్టదీర్ఘము, వివృతదీర్ఘము కాదు అని సుప్తార్థప్రకాశికలో స్వమతము వర్ణింపఁబడినది. పై వర్ణోపదేశమందు ఈషత్స్పృష్టదీర్ఘౡకారము కలదేని ౠకారములు రెండు ఉపదేశింపవలయును. ఒకటి ఈషత్స్పృష్టదీర్ఘము, మఱియొకటి వివృతదీర్ఘము. ఈరెండిటిలో నొకదాని నుపదేశించి రెండవదాని నుపదేశింపకుండుటకుఁ గారణము లేదు గాన సుప్తార్థప్రకాశికామతము చింత్యమే. ౠ అను దీర్ఘర్కారము వివృత మనియు నీషత్స్పృష్ట మనియు ద్వివిధము. అందు వివృతమునకు మధ్యభాగమున నొక రేఫమును జుట్టు నజ్భాగమునుకలదు. ఈషత్స్పృష్టమునకు మధ్యభాగమున రెండు రేఫములును జుట్టు నజ్భాగమును గలదు. ఇట్లే ౡకారమును ద్వివిధము. కాని మధ్యభాగముననొక లకార మున్నదివివృతము. రెం డున్నది యీషత్స్పృష్టము అని సంస్కృతవైయాకరణులకు సువ్యక్తము. అందు "మంత్రశాస్త్రంబున అకారాదిపంచాశద్వర్ణావళి (50) జపమాలికగా భావింపఁబడుటచేఁ బైసంఖ్యాపూర్తికై ౡకారదీర్ఘంబును సమ్మతింపఁబడిన దందురు" అని ఇతరమత ముపన్యసింపఁబడినది. ఇదియును జింత్యమే. ఏలన, మంత్రశాస్త్రము ౡం నమః అని తత్తదుపాసనలయందు ఫలదాయక మని చెప్పుచున్నది. కాని భాషలోఁ గల దని నిరూపింపలేము.

భాషలో నున్నయెడల నర్థబోధక మగు ౡకారఘటితపద ముండవలయును. అట్టిదాని నెవరును జూపలేరు. ఇట్లు కాదేని సామగానమున ఫలదాయకము లగుచు "అధ్వర్యోబద్రిభిః" ఇత్యాదులందు ప్రసిద్ధములగు నర్ధైకారార్ధౌకారములు గూడఁ గల వని యొప్పుకొనవలయును. అట్లైన న్యూనత స్పష్టమే. శ్లో. ౡకారో దేవనార్యాం స్యా న్నార్యా

త్వన్యపి మాతరి, అని మేదినీకోశావ్యయప్రకరణమునఁ గల దందురా? ఛందసి పరిపంథి పరిపణౌ పర్యవస్థాతరి, అని పాణిని సూత్రముండఁగా, "ప్రత్యర్థిపరిపంథినః" అను నమరకోశోక్తికి ఏగతియో యదియేగతి యీ మేదినీకోశమునకును గల్పింపవలయును. విమర్శింపఁగా ౡకార దీర్ఘము వైదికము, లౌకికము కాదు అని నాకుఁదోఁచినసిద్ధాంతము. "ౡవర్ణ స్యద్వాదశ తస్యదీర్ఘాభావాత్" నుకౌముదీగ్రంథము లౌకికసంస్కృత భాషావిషయమే. "ఏఓఙ్" సూత్రస్థ మగు "వర్ణైకదేశా వర్ణగ్రహణేన చేత్సంధ్యక్షరేషు సమానాక్షరవిధిప్రతిషేధః" అను వార్తికమున "సమా నశబ్దేన పూర్వాచార్యనిర్దేశా దకో భిధీయంతే దశసమానా ఇతి వచ నాత్ అను ప్రదీపవ్యాఖ్యానావసరమున నుండు "వచనా దితి అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ దశసమానాః ఇతిపూర్వవైయాకరణ వచనా దిత్యర్థః" అను ఉద్యోతాదిగ్రంథము వైదికవిషయక మని చెప్పుట న్యాయ్యము. శౌనక ప్రాతిశాఖ్యయందుఁగూడ ౡకారదీర్ఘము కలదని కలదు. ఇదియును వైవిషయమునకుఁ బ్రమాణము కాఁగలదు. వైదికభాషామాత్రగోచర మగు ళకారము నుపదేశించినసూరిగారు వైదికభాషామాత్రగోచరమగు వివృతదీర్ఘౡకారము నుపదేశించి రనుటకు బాధక మేమియు నాకు స్ఫురించుటలేదు. అగ్నిమీళే ఇత్యాది వేదమందు అజ్మధ్యస్థ డకారస్యేత్యాది ప్రాతిశాఖ్యలచే విహితముగాన వైదికభాషామాత్రగోచరమగు ళకారోపదేశము తప్ప గునపుడు ఈవివృతదీర్ఘౡకారోపదేశము గూడతప్పె యగును.

"ఇందకారాదు లచ్చులు కకారాదులు హల్లులు, అజ్ఝల్విభాగ మీలాగుననే మీఁద నెఱుంగునది" అనుదానికి "పై యేఁబది యక్షరం బులలో అకారము మొదలుకొని విసర్గము వఱకు అచ్చు లనియు, కకా రము మొదలు ళకారము వఱకును హల్లు లనియునుబేరు. అజ్ఝల్వి భాగము (అచ్ + హల్ + విభాగము = అచ్చు లనియు హల్లు లనియు, ఏర్పాటు)

ఇలాగుననే అకారాదు లచ్చు లనియు కకారాదులు హల్లు లనియుఁ, బ్రాకృతభాషకును దెలుఁగునకును, దెలిసికొనునది." అని సూత్రప్రకాశికావ్యాఖ్యానము కలదు. అనుస్వారవిసర్గములకు సంస్కృతమున అచ్సంజ్ఞయు హల్సంజ్ఞయు రెండును నుండఁగా నచ్సంజ్ఞయే కల దనుటచింత్యము. వీనికిఁ దెనుఁగున నచ్సంజ్ఞకే ఫలముగాని హల్సంజ్ఞకు ఫలము లేదు గాన నట్లచ్సంజ్ఞయే చెప్పఁబడిన దని సమాధానము చెప్పుట న్యాయముకాదు. విమర్శింపఁగా నచ్సంజ్ఞ లేదు, హల్సంజ్ఞయే కల దనుట యుక్తతరమని తోఁచెడిని. అచ్సంజ్ఞ లేదనుటవలన రాముండు అనుచోట "ఉత్తునకచ్చు పర మగునపుడు సంధి యగు" అనుసూత్రము చేత మకారోత్తర మందుండు ఉకారమునకు ననుస్వారరూపమగు హల్లు పరమగుటచేత నచ్చు పరము కాలేదు. కావున సంధి రాలేదు. అనుస్వార మచ్చైనయెడల సంధి తప్పదు. అనుస్వారవిసర్గములు హల్లులనుటవలన, ప్రాసములందచ్చేదియైన నుండవచ్చును కాని హల్లు అదియే యుండవలయు ననునియమము కలుగుటచేత ననుస్వారప్రాసమునం దనుస్వార ముండుటయుఁ దదుత్తరహల్లుకూడ నియమముగ నుండుటయు సమంజస మగుచున్నది. "అంకము చేరి" మొదలగు పద్యములయట్ల అందము అనుప్రాసమునకు దోషము సిద్ధించుచున్నది. ప్రాసములం దచ్పూర్వవర్తిహల్లులకు నియమము కలదు గాని అజుత్తరవర్తి హల్లునకు నియమము లేదు గాన ననుస్వార మచ్చైనయెడలఁ దదుత్తర కకారమునకు నియమముండదు. కాన "అందము" అని ప్రాసములందు అనుస్వారోత్తరమునఁ దకారం మేల యుండరాదో యూహింపుఁడు. క. అ ఆ లై ఔలకుమఱి, ఇ ఈ లు ... అని కవిజనాశ్రయమున సంజ్ఞాధికారమున కలదు. ఆకారమునకు సమముగా నీకారము ప్రాసమునను గలదు. కాన ప్రాసము లందజ్నియమము లేదనియేసిద్ధాంతము. కనుకనే, ఉ. అమ్మలఁ గన్నయమ్మ ... నమ్మిన వేల్పుటమ్మల" ఇత్యాదులందు "మ్మ" అనుదానికిఁ దుల్యముగ వాడిన "మ్మి" అనుప్రాసము సాధు వగుచున్నది. మఱియు కణిఁతి, కణింతి = గ్రంథి కడిఁది, కడింది = ఆపద. వీనికి బహువచనమున

"వికృతియం దికారాంతముల యుపోత్తమేత్వమునకు ఉత్వం బగు" అను సూత్రముచేత కణుఁతులు కణుంతులు కదుఁదులు కదుందులు అను రూపములగును. ఈబిందువునకు నత్త్వ మున్నయెడల బిందువే యుపోత్తమము గాని ఇకారము కాదు గాన నుత్వము రాక కణింతులు మొదలగు విపరీతరూపములగును. హల్లే యగునయెడల కణుంతులు మున్నగుసాధురూపములు సిద్ధించును.

అర్ధానుస్వారము హల్లే అని అంగీకరించినను కలఁగి చెలఁగి ఇత్యాదులందు సంయోగపరక లకారోత్త రాకారము అద్రుచు విద్రుచు చిద్రుపలు మున్నగుచోట్ల దరసంయోగపూర్వస్వరమువలె గురువు కాదని యెఱుఁగునది. భారతాదికవు లర్ధానుస్వారప్రాసమును పాటించుటచేత నిదియును హల్లని చెప్పవచ్చును. లేదా, ఇదివర్ణమే కాదు: పూర్వవర్ణము అనఁగా పూర్వస్వరమున కనునాసికత్వమును దెలియఁజేయుగుఱుతు. కలఁగు, చేఁదు మొదలగుపట్ల అర్ధానుస్వారపూర్వస్వరంబులు అనునాసికములుగా నుచ్చరింపవలయును. సంస్కృతమునందును సయుంతా, సంయంతా ఇత్యాదిరూపములందు "అత్రానునాసికః పూర్వస్యతువా, సూత్రముచేత నకారోత్తరాకారమునకు అనునాసిక్యము విధింపఁబడినది. అట్టిదియ యిదియును. సంస్కృతలిపియం దీగుఱుతు పూర్ణానుస్వారముతోఁ దుల్యముగ నుపస్థితము. ఈయాంధ్రభాషాలిపియం దుపార్శ్వస్థితము, అనుమతమున సంయోగము లేదు. కానఁ బూర్వస్వరమునకు గురుత్వాపాదనమునకు నవకాశమే లేదు. కందాదులందు ప్రాసపూర్వస్వరమునకు గురుత్వలఘుత్వ నియమమువలెఁ బ్రాచీనులమతమునఁ బ్రాసపూర్వస్వరమునకు నానునాసిక్యనియమము సర్వత్ర కలదని యెఱుఁగునది. ఈమతమున నర్ధానుస్వారమును వర్ణాంతరముగా చిన్నయసూరి పృథక్కరించుట చింత్యమే.

సంస్కృతమున అనుస్వారము హల్లుకూడ నగును గనుకను తెనుఁగున హల్లే యగుటచేతను సంయుక్తము పరమగు నపుడు

పూర్వవర్ణము గురు వను వాక్యముచేత నందము ఇత్యాదులం దకారముగురు వగుచున్నది. శ్లో. సానుస్వారో విసర్గాంతో దీర్ఘో యుక్తపరో గురుః" అనుచోట సానుస్వారః విసర్గాంతః అనునవి యుక్తపరః అనుదానికిఁ బ్రపంచరూపము లని తెలియఁగునది. సానుస్వారో విసర్గాంతః అనునవి ప్రపంచార్థము కావుననే భగవత్పాణినిమహర్షి "హ్రస్వం లఘు, సంయోగే గురు, దీర్ఘం చ" అనియే సూత్రించి సానుస్వారవిసర్గములకుఁ గూడ గురుసంజ్ఞ నుదిరిగి విధింపలేదు. సంస్కృతమున వీనికి రెండుసంజ్ఞ లుండుటకు ఫలములును రామః, హరిః, హరిం వందే ఇత్యాదులందు సవర్ణదీర్ఘయణాదేశాదులు రాకుండుటకు కారణములును పాణినీయమును బట్టియే యూహించునది. తెనుఁగున సిద్ధానుస్వార ముండుటచేత నట్టియుపపత్తు లిట పొసఁగవు ?

మఱియును అకారాదులు = అకారసదృశములు. (ఇటసాదృశ్యము స్వాతంత్ర్యోచ్చార్యమాణత్వ మని వివక్షింపఁబడినది ) కకారాదులు=కకారసదృశములు (ఇటసాదృశ్యముఇతరాధీనోచ్చారణవిషయత్వ మని వివక్షింపఁబడినది) అనుస్వారవిసర్గములు హల్లులు వలెనే అచ్చులకు అధీనమైన యుచ్చారణము కలవిగాని అచ్చులువలెనే స్వతంత్రముగా తెలుచుచుచ్చరింపఁబడునవి కావు గాన సాదృశ్యము పైవిధముగ వివక్షింపఁబడినది. ఇట్లువ్యాఖ్యానము చేయుటచేతఁగాని కకార స్యాదీ కకారాదీ, కకారః ఆదిః యేషాం తేకకారాదయః, కకారాదీచ కకారాదయశ్చ కకారాదయః అని సర్వత్ర లోహితాదిక తస్తేభ్యః భూవాదయో ధాతవః అను సూత్రములభాష్యమునందుఁ జెప్పఁబడినరీతిని వ్యాఖ్యానము చేయుటచేతను గాని హల్త్వసంపాదనాత్త్వనిషేధములను సిద్ధింపఁజేయవచ్చును. ఇట్టికిష్టకల్పనము శ్రీసూరిగారికభిప్రేతమని తోఁపదు.

# కావ్యార్థ సంగ్రహ సమాలోచన

ఉభయభాషాప్రవీణ—మల్లాది సత్యనారాయణశాస్త్రి.

(అనువృత్తము.)

---

ఆ కారణముచేఁ బూర్వాపరస్థస్వరూపభేదమువీడి లక్ష్యగ్రంథములలో లక్షణోక్తాంశములు స్వయముగ నుపనిబంధింపఁబడి యుండవచ్చును. కనుకఁ బై లక్ష్యలక్షణగ్రంథనిర్మాతలు కావ్యధర్మనిబంధనావసరమున వాసనావాసితైకఘంటాపథముననే పోవఁ జూచిరను నామాట పూర్వగ్రంథములను బట్టి యసత్యము కాదు. కనుక లక్ష్యగ్రంథములను గొన్నింటిని జూచి లక్షణగ్రంథములను జేసిరనుట యంత విమర్శోత్పన్నము గాదని నాయభిప్రాయము. అట్లుకానిచో నాలక్ష్యగ్రంథకర్త మాత్ర మావిధముగ మొదటగా నా గ్రంథమును జేయుట యెచట నేర్చినాఁడు ? ఆ నేర్పు లక్షణగ్రంథకర్తకు మాత్రము మొదటగాఁ గలిగినచోఁ దప్పా ? పాణిన్యాచార్యుఁడు శబ్దశాస్త్రమును వ్రాయుచు నే గ్రంథమును మున్నెఱుకొనెను ? కనుక లక్ష్యలక్షణగ్రంథములు పరస్పర ముపజీవ్యోపజీవకత్వము నందవలయు నని గాని యన్యోన్యవిరుద్ధము లని గాని యనరా దని నా భావము. వానియందు సహృదయశాస్త్రజ్ఞులు తాత్పర్య ముంచిన నవి యానామధేయమునకుఁ దగియున్నవియే యగును. వానిసంపూర్ణతాసంపూర్ణత లిచటఁ జర్చార్హములు గావు. ప్రకృతమునకుఁ బోదము. అట్టి లక్షణగ్రంథములలో నుత్తమనాయకచరితములనే లక్ష్యగ్రంథములలో నిర్దేశింపవలయు నని ముక్తకంఠముతో ముచ్చటింపఁబడినది. పూర్వలక్ష్యగ్రంథములలోను సాధారణముగ నట్టులే చేయఁబడినది. అయినను కేవలతాత్కాలిక చమత్కారఫలితములుగఁ బూర్వమునను, నానాభాషలలో నిపుడును, జార, చోర, క్రూర, మారకచరితములు సహృదయులు బాపురే యను

నట్లు వస్తుసందర్భసంవిధానమును బురస్కరించుకొని రచనారమణీయతను మఱువక కవితలు చెప్పుకవివరేణ్యులచేఁ గల్పనానైపుణితోఁ బుష్టి నొందింపఁబడి గ్రంథరూపమును దాల్చినవి యెన్నివేలు లేవు ? వానినుండి మాత్రము రసభావాదులు పొంగి పొరలకపోయినవా ? చూడుఁడు.

సంచరింపుము పూజారి ! సంకుచింప
కిపుడ యీ వేఁపి సచ్చెను గినుకఁ బూని
రమ్యగోదావరీజలప్రాంతభూమి
కుంజమున నుండు సింగంపుఁగొదమ చేత.

అను సీసపద్యమునకు మాతృకయగు శ్లోకము కావ్యప్రకాశాదులలో నుత్తమోత్తమధ్వనికావ్యముగ నైకకంఠ్యముతో నుదాహరింపఁబడినది. ఆశ్లోకము కూడ నార్యాసప్తశతిలోనిది. ఆగ్రంథమును వ్రాసిన గోవర్ధనాచార్యమహాకవి యీపద్దెగుల నొకదానితో నొకటికి సంబంధము లేకుండ ననఁగా వ్యంగ్యార్థము కేవలము కవి భావక సహృదయతాసముల్లసిత మనుటకై ప్రకరణాదిసహాయము లేకుండునట్లుగా నేర్పఱచినాఁడు. మఱియు నాశ్లోకము లోకోత్కృష్టియు నోకోత్కృష్ట కావ్యమని పెద్దల నిర్ణయము. కనుకనే పండితరాయలు "రమణీయార్థప్రతిపాదకశ్శబ్దః కావ్య" మ్మని శబ్దమాత్రమునకుఁ గావ్యత్వము నాపాదింపఁగలిగెను. ఇట్లన్ని లక్షణములు బాగుగనే యున్నవి.

కాని యీపద్యమునందలి వస్తువు మాత్రము చెప్పుకొనఁదగినంత నీతిబోధకము గాదు. కాన నిట్టివానిని గనినవారు గ్రంథపఠనపర్యవసానమున నేర్చుకొనఁ దగినన్ని నీతులు నేర్వఁజాల రని నాయభిప్రాయము. గ్రంథోద్ధృతనీతు లన్నియుఁ బాఠకులు నేర్చి యట్లు దామును గొంతవఱకైన నడచుకొన యత్నింతు రని గదా! చదువనివారిమంచినడవడికకంటెఁ జదివినవారిమంచినడవడిక యాధిక్యముతోఁ బ్రశంసింపఁ బడుచున్నది. మఱియుఁ జదివినవారితప్పును జదువనివారితప్పుకంటె మిక్కిలి నింద్యముగఁ జూచుచున్నారుకూడ.

కొన్ని యెడలఁ గవిప్రౌఢోక్తిసిద్ధ్యుపదేశములకంటెఁ గవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధ్యుపదేశములయందు సౌందర్యము మెండుగఁ గలుగుచుండును. కనుకనే ధర్మశాస్త్రానుశాసనాదులు గావ్యానుశాసనాదులకంటె నుపాదేయత్వరూపాచరణమున వెనుకఁ బడుట సంభవించుచున్నది. అట్లు కానిచోఁ గావ్యోత్పత్తికే తావు లేదు గదా. కనుకఁ గావ్యములయం దుత్తమనాయకచరితములనే యుపనిబంధింప నవసరమని తెలుచున్నది గదా. ఉత్తమనాయకచరితములనుండి, పాఠకులు గ్రహింపఁ దగినవిషయములు వేనవేలు ప్రత్యంశమునందును స్ఫురించుచుండును. చూడుఁడు; భూలోకమహేంద్రుఁ డగుదశరథమహారాజునకు లేక లేక కలిగిన సంతానములో సుగుణములచేతను సర్వోత్తముఁడనఁ దగు శ్రీరామచంద్రుఁడు పదునాఱేండ్లకు లోపలివయస్సువాఁడైనను సౌధాగ్రమునుండి యంతకుమునుపు దిగనివాఁడైనను బహుదూర మొక్క ముదుసలిమునివెంట నడిచే మొదలుగాఁ గాలినడకను బోవలసివచ్చినను, దా నెపుడును నెండక న్నెఱుఁగక పోయిన నిపుడైన ఛత్రచామరాద్యకభోగసాధనములు బొందనివాఁడైనను దారుణభయంకర, ప్రబల, మాయావి, మనుష్యమాంసాదనులసంఘముతో బవరము చేయవలసి యున్న దని యెఱిఁగియున్నను, అనేక దేవాసురయుద్ధములలో మహేంద్రసమాహూతుఁడై సంగర మొనరించి విజయలక్ష్మీకరస్థమంగళకుసుమమాలికాపినద్ధవక్షుండై వానికష్టసుఖములనామూలాగ్రము గుర్తెఱిఁగినతండ్రిచే పంపఁబడ సమ్మతి లేనట్లు దెలియఁబడుచున్నను, యాగసంరక్షణమునకుఁ గాను విశ్వామిత్రునిచేఁ గోరఁబడి తప్పనిసరిచేతఁ దండ్రిచేఁ బంపఁబడి కుతూహలియై కాకపక్షము లెగిరివడఁ జిన్నచిన్నయమ్ములపొదులను, చిన్నధనుస్సును, కోమల మాంసల భుజశిరములను, ఆయత భుజాగ్రహస్తమున ధరియించి యనుజలక్ష్మణద్వితీయుఁడై, ఎదురును వెనుకను లేక యామునివెంట నేఁగెననఁగా నిందలి నీతులు ఎన్ని నేర్వఁ దగియున్నవో లెక్కింపఁ దరమా?

పాలకుని పరిపాలనాధర్మ మట్లుండవలె నని వీర్యవంతునకు వయసుతో నెదిరిబలఁగముతోను బని లే దని, రాజధర్మము బహుభోగసాధనములు గలదిగ నుండుటమాత్రమే గాని రాజు నిత్యసుఖాపేక్షగ నుండరా దని, క్రియాసిద్ధి ప్రధానముగాని బహుళసాధనసంపత్తితో నిమిత్తము లే దని శాస్త్రీయమైన యజ్ఞాదిదైవకార్యములపట్ల శ్రమ మైనను జిన్నతన మైనను, సహాయసంపద తక్కువ యైనను, రాజన్యుఁడు దేశధర్మరక్షణకై దీక్ష వహించి నిర్భయముగా నెదుట నిలువ వలయు నని, యివియు వీని నుండి మఱికొన్నియు దేశక్షేమంకరగుణాభివర్ధక లగునీతులు స్ఫురించుట లేదా ? ఇట్లు నేర్చునీతులను బట్టి మన మందఱము లోకమున మంచి నడవడికఁ గలిగి యుండు మను నిర్ణయము చేయలే కున్నను నూటి కొక్కనిది గాని వేయి కొక్కనిదిగాని జన్మాంతరోపాత్తకర్మ మంచిది యై యుండు నని యనుకొనిన పక్షమున వాని యాకర్మకు ఫల మగు సుగుణసంపత్తి నిత్య మగునాతని మనసునందు నంకురము బీజము నందుఁ బోలె మొదట నణఁగి యుండి యితరసహకారకారణ సదుపదేశ, సజ్జీవన, సంమేళనాది సామగ్రితోఁ గూడినపుడు బయటికి నుద్బుద్ధ మగుచుండును. గాన దానివలన నాగుణి గ్రామణి గ్రహములలో సూర్యునివలె నక్షత్రములలోఁ జంద్రునివలె జనసమూహములో మొదటగా నిలుచుచుఁ దన పరోపకారపరతాద్యుత్తమక్రియాకరణ దీక్షను బూనును గాన నున్నతుఁ డై చిరకాలము ధగధగలాడకపోఁడు. ఇతరులు నా యాకార్యములనుఁ జేయుచు నట్టితొందరలపట్ల నీ కథాశ్రవణజన్యజ్ఞానము కొంచెముగ నైన వారిమనస్సును మార్పక పోదు. ఇట్టి ప్రయోజనములు నీచనాయకాశ్రయ కథాశ్రవణ పఠనములవలనఁ గలుగఁబోవు. ఇచటఁ బైనఁ జెప్పినగుణము లెక్కువ గలవార లే యుత్తమనాయకు లనియుఁ దక్కువగుణములు గలవారలే నీచనాయకు లనియు గ్రహింపవలెను. ఒకప్పు డానీచనాయకులుగూడ నొకటిరెండు మంచిగుణములు గలవార లగుటచేతనే యొకకొందఱు కవి

హృదయముల నాకర్షించి వారిచే నందముగను జాలిగను జెప్పఁబడిన స్వగుణానుకథకగ్రంథములమూలమునఁ గొంతకాలమువఱకు జనులచే స్మరింపఁ బడుచుండుట యరయు చుందుము. అట్లయినప్పుడు చాల గుణములు గలవారివిషయమునఁ జెప్పవలసినదేమి ?

కవులురసవంతముగఁ గావ్యములను నిర్మించుటయే భావకుల యానందమునకు ముఖ్యముగఁ గారణ మైనను, ఆయానందము వారి మనస్సులలో నిత్యముగ నుండునట్లు జేయుటయు నాకవులకు గొప్ప పూచీ యై యున్నది అపని యధికగుణనాయక కథాశ్రయణము గల కావ్యములవలనఁ గాని యలవడదు. జన్మవిశుద్ధ పూర్వోక్తసుగుణములు గొన్ని ప్రకృతచమత్కారరూపకార్యముపట్ల వినియోగపడినను బడకున్నను గథాపర్యవసానమున హెచ్చుగ నాగుణములు గలనాయకాశ్రయకథాభాగములవలననే చదువరులకు హృదయద్రావణము గలుగుచుండును గాన నవి కవులచే బొత్తుగ మఱువఁ దగవు. మఱియుఁ బురాణాదులనుండి యుద్ధృతములగు నుత్తమనాయకాశ్రయకథాభాగముల నుపజీవించి పిమ్మటి కవులు మరల వ్రాయుటలో, లోకోత్తర రసభావగుణాలంకారాదికావ్యాత్మస్వభావస్వాత్మ్యాదులను సంతరించుటతోపాటు కథానాయకుల సౌభాగ్యాదివర్ణనలు మాత్రము గాక వారి కష్టకాలికసమాచరితములును బ్రధానములుగు దేశక్షేమోద్దేశ్యకోపదేశదానక్షమోత్తమచరితములును గూడ సమకూర్చుట మఱువరాదు. సువర్ణముయొక్క మంచిచెడుగులు కషణోపలదీప్తాగ్నులవలన వలె నుత్తమవ్యక్తిధారణమువలనఁ బ్రస్ఫుటములు గానట్లు నాయకగుణదోషములును నాయక దుఃఖకారణవిప్రలంభాది కాలికసమాచరితములవలన వలె నాయకానందకారణ సంయోగాదికాలికసమాచరితములవలనఁ బ్రస్ఫుటములు గానేరవు. వానినిబట్టియే యాకావ్యములకును శోభోత్పత్తిగాన నాకావ్యములలో నానాయికానాయకుల విప్రలంభాదులు దప్పక వర్ణింపవలయును. కనుకనే పూర్వపుఁ గావ్యనాటకములు

హెచ్చుగ రామాద్యుత్తమనాయకాశ్రయకథలు గలవిగను, వారి కష్టకాలికచరిత్రములు గలవిగను నిర్మింపఁబడినవి. ఇట్లింతట సదుపదేశకోటికమును, రసభావాద్యలంకారికసమయసంప్రాప్తసామగ్రీసంభావితము నగు నుత్తమకావ్యమును నిర్మించుటను బోధింపనే ప్రాచీనులగు లక్ష్యలక్షణవేత్తలు బహువిధములఁ బాటుపడుచుండిరి. కనుక "నానృషిః కురుతే కావ్య"మ్మను నభియుక్తోక్తినిబట్టి జన్మాంతరకృతపుణ్యకర్మవశమున నలవడిన యతిప్రాసాదిశబ్దాలంకార సంయోజననైపుణి గలకవిసోదరులును, దూరాన్వయము మొదలగు భావకహృదయవైరస్యోత్పాదనకారణక్లిష్టతలు లేకుండ గద్యములను సమముగ నడిపింపఁగల చతురులును, సరళమగు తమయాశయమును మృదుశబ్దములమూలమున నిర్మల పర హృదయములయందు ఛాయాచిత్రకారుఁ డుత్తమదృశ్యమును స్వచ్ఛాదర్శములమూలమున శుభ్రపత్రములందువలెఁ బ్రతిబింబింపఁజేయ నేర్పరులై, దమ తమ యుత్తమసామర్థ్యములను జిరకాలము జనులు గొనియాడునటులఁ జేయఁగడంగినచో నపు డీవసుంధరారమణి, యీవఱకే నిరంతరము నశ్వరనిర్మలకీర్తికాయు లగుకాళిదాసాదులవంటి నిర్జరకవితనయులను గని యున్నది కాకపోవునా? పరోపకారార్థజన్మ మయినదియు, వక్రక్రీడాపరిణత గజప్రేక్షణీయ మయినదియు నగు నాషాఢప్రథమదివసీయమేచకమేఘము, నీలవర్ణమును గగనమార్గసంచరణమును గలిగిన దని నిర్దీప నిర్జన నిస్త్రాంత శోభములై దారిద్ర్యదేవత నారాధింపఁదగు ఛిద్రగృహముల మూలల నివసించునసద,మసటు,గబ్బిలములతోఁ, సరిఁజేయ యత్నించుట న్యాయస కాని యూహాచాపలమును వెల్లడించును గాని బుధచతుర్వరుల యెడదముల నావర్జింపఁ జాలునా? కనుక వినుటతోడనే పాఠకమానసాకర్షణపటుశబ్దార్థాలంకారాది కావ్యశరీరశోభాకారణముల నలవఱచుకొనుట మాత్రము కావ్యకరణప్రధానోద్దేశ్యము కాఁగూడదనియు, నప్రధానములగు నవ్యాసితోఁ గూడిన యుత్తమనాయక చరిత్రాత్మలే

ళున స్ఫోరణములు ప్రధానములుగ నుండవలయు ననియుఁ గవివరులు గ్రహించుకొనవలసి యుండును.

వాస్తవముగఁ గవికిఁ గావ్యకరణమునకుఁ బ్రతిభయొక్కటియే కలిగినఁ జాలును. దానిమూలమునఁ గవి యెట్టికథ నైనను రసవత్తరముగ వసంతర్తువు ప్రాణమాత్రావశిష్టతరుస్కంధములను బల్లవింపఁ జేసి సర్వతోముఖ రమణీయత గలదిగఁ జేసినట్లు జేయఁగలఁడు. కాళిదాసుని మేఘదూత కావ్యమునందుఁ గథయేది? ఏపురాణమునుండి యుద్ధృతమైనది? అందలి కవినైపుణ్యమునకు మెచ్చుకొనుచు రిచ్చపాటొందవని వారెవరు? కనుకనే కవియందు నీశ్వరత్వమాపాదించుట లోకసముదాచార మయినది. చూడుఁడు.

"నియతికృతనియమరహితాం,
హ్లాదైకమయీ మనన్యపరతంత్రామ్,
నవరసరుచిరాం నిర్మితి
మాదధతీ భారతీ కవే ర్జయతి"

యను నీకావ్యప్రకాశ ప్రథమశ్లోకము కవిభారతిని బ్రహ్మగా నుపశ్లోకించుచున్నది. కాని పైన నేను వర్ణించినట్లుఁ గవియుద్దేశ్యములు లేని చోనపుడా కావ్యములు, ప్రాతఃకాలమునఁ దృణాగ్రావస్థితహిమబిందువులు గొంచెము సేపు సూర్యకాంతిని నమున్మిషితములై రతనముల తునకలవలెఁ గనుపట్టి చివరఁ దమంత తాముగాని స్వల్పాన్య కారణమునఁగాని స్థానభ్రంశము నొంది భూమిపై నెచటఁబడి యేమయినవి తెలియకుండ రూపుమాయునట్లు స్వరూపనాశనమొందఁ గలవు. కనుక నట్టివి కాకుండుటకై కవి సర్వవిధముల నాయత్తపడవలయును. అందుచేతనే కాళిదాసాది మహాకవులు హెచ్చుగ మహాభారతాదుల నుండి యుత్తమనాయకచరితముల నుద్ధరించుకొనిరి. కనుకనే యాకావ్యములు నిప్పటివఱకుఁ నిలుచుటకుఁ గారణ మయినది. అట్టి మహాకవులలోఁ గాళిదాసు సర్వోత్తమకవయిత యని మన భారతదేశపండితుల చేతను

ఇతరదేశ పండితులచేతను గూడ ననేకవిధములఁ గొనియాడఁ బడిన వాఁడు. అతఁడు మూఁడు శ్రవ్యకావ్యములను మూఁడు దృశ్యకావ్యములను సంతరించి యఖండకీర్తిని లోకమున వ్యాపింపఁజేసి స్వర్గలోకమున నిరంతరసుఖము ననుభవించు చున్నాఁడు. ఆకవివర్యుఁడు క్రీస్తునకుఁ బూర్వుఁ డగు చంద్రగుప్తాపర నామక, విక్రమార్కుని యాస్థానవిద్వాంసుఁడై యారాజుమన్ననల నందినవాఁడు. దీనికి నిదర్శనము.

"ధన్వంతరి, క్షపణకా, మరసింహ, శంకు,
వేతాళభట్ట, ఘటకర్పర, కాళిదాసాః,
ఖ్యాతో వరాహమిహిరో నృపతే స్సభాయాం
రత్నాని వై వరరుచి ర్నవ విక్రమస్య"

అను ప్రాచీనశ్లోకము. ఈశ్లోకమునకుఁ బాఠభేదములు నన్వయభేదములును వ్యతిరేకార్థాన్యశ్లోకములను వేనవేలు లేకపోలేదు. మఱియు నేతద్వ్యతిరిక్తకాలికుఁ డని కూడ వాదములు లేకపోలేదు. ఆ వాదముల నన్నిటిని నా కాళిదాసకాలనిర్ణయసాధనమును బట్టి యుపేక్షఁగ ద్రోసివేయవచ్చునని నే నూహించుచున్నాను. సవిమర్శపాఠకులు నా యీచాపలము నుగని క్షమింతురు గాక.

# ఛందోదర్పణసమీక్ష.

రావూరి దొరసామి శర్మకవి.

---

అనంతామాత్యకృతమగు ఛందమునకు ఛందోదర్పణమని, యనంతునిఛందమని రెండుపేరులు గలవు. అట్లున్నను గొందఱు అవి భిన్నములని భ్రమించుచున్నారు. అప్పకవీయమునఁ బూర్వగ్రంథనామసంగ్రహావచనమున 'అనంతామాత్యచ్ఛందంబును, ఛందోదర్పణంబును' అని పృథక్కుగా లిఖింపఁబడియున్నది ఇది లేఖకప్రమాదజనితంబుగానోపును ఇవి రెండొకటియేయని యెఱుంగవలయు.

అనంతామాత్యునిచరిత్ర యాంధ్రకవులచరిత్ర మున్నగు గ్రంథంబులఁ జర్చింపఁబడి యున్నది. అనంతుఁడు 15 వ శతాబ్దమధ్యమునందలి లాక్షణికకవి. ఇతఁడు భోజరాజీయము, ఛందోదర్పణము, రసాభరణము ననుకృతిత్రయము రచియించెను. ఛందోదర్పణోపోద్ఘాతంబున నొకరు రసార్ణవ మనిరి. రసాభరణమునకది నామాంతర మగునేమో తెలియరాదు. ఛందోదర్పణమునకు విపులమైన యుపోద్ఘాతమును శ్రీగిడుగు వేంకటసీతాపతిగారు విరచించిరి. అందు వారు వివిధవిషయంబులవిస్తారంబు విమర్శించి యున్నారు, కాని నాకు మఱి కొన్నియంశంబులు స్ఫురించుటచే వానిని బ్రకటించుటే యీవ్యాసరచనకు ముఖ్యోద్దేశము.

ప్రథమాశ్వాసము:-

1. గురులఘుచిహ్నవివరణమందు 'లఘువు దసరును హరి యొక్కరుఁడ పరతత్త్వ మనుచును సురుచిరముగఁ జుట్టి వ్రేలఁ జూపిన మాడ్కి'అని యింతదీర్ఘముగా శిరోవేష్టనప్రాణాయామమువంటి వివరణ మేలకో. 'ధరపై లఘువులు వెలయుఁ గరిమ న్నిడుగీటు వ్రాయుకరణి ముకుందా'యని యెంతసులభముగా సులక్షణసారమునఁ గలదో కదా!

2. త్రిప్రాసము.

'అత్రివిక్రముఁ డక్షయప్రదాత యనఁగ
వాక్త్రికథగోజ్జ్వలులు విష్ణుభక్తు లనఁగ.'

అనునుదాహరణముల నొసఁగుచు ననంతుఁడు త్రికారమునకు తకారమునకుఁ బ్రాస మన్నాఁడు. ఇకారవిశిష్టత్రకారమునకు మాత్రమే యీప్రాసము చెల్లు ననియుఁ దదితరములకుఁ బొసఁగ దనియు నర్థ మగుచున్నది. 'సంఖ్యఁ జెలువు త్రికారంబు జనుఁ దకారసదృశమై త్రికారప్రాసనంజ్ఞ గలిగి' యని స్పష్టముగా త్రికారమే పేర్కొనఁబడియున్నది.

ఇందులకు అప్పకవీయమున సంయుతాసంయుతప్రాస సందర్భములో-

'రలలు తమక్రింద జడ్డలై క్రాలువ్రాలు
ప్రాసవర్ణంబులై వానిఁ బాసియైనఁ
గూడియైనను బెఱయుడుగులను నిలుచు
సంయుతాసంయుతప్రాససంజ్ఞఁ దనరి'

అని కలదు. భారతము-ఆదిపర్వము.

ఉ. క్షత్త్రియవంశ్యులై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్త్రియవైశ్యశూద్రు లనఁగాఁ దగు నాలుగుజాతులన్ స్వచా
రిత్రముఁ దప్పకుండఁగఁ బరీక్షితుఁ గాచినయట్లు రామమాం
ధాతృ రఘుక్షితీశులు ముదంబునఁ గాచిరి యేయుగంబులన్.

పై పద్యమున త్రికారమునకే కాక త్రకారమునకును బ్రాసమైత్రి గలదు.

*మఱియు నట్టిదే యీక్రిందిపద్యము. సోమునిహరివంశము.*

శా. నాతో మార్కొనలేరు నిర్జరపురీ నాగేంద్రబృందారకా
రాతు ల్మున్నుగ దేవసంఘములు పోర స్థిరసంగ్రామకుం

డీత్రైలోక్యమునందుఁ గల్గఁడు రణం బెచ్చోట లేకుండఁగాఁ
జేతు ల్వ్రేయు వృథాభరం బగుచు వచ్చె న్దేవ యీమేనికిన్.

ఇందు త్రైకారమునకు తకారప్రాసముగలదు.

భాస్కరరామాయణము (యుద్ధకాండము-1556. వ.)

క. నాకన్నులయెదురంబడి
యేక్రియ మెయిమెయిన బ్రదికి యేఁగెదు నిరన్ ......

త్రికారత్రకారములకే కాక యప్పకవి నుడివినవిధంబున రేఫశ్లిష్టశబ్దములకెల్ల ననంయుతంబుగాఁ బ్రాసంబుఁ గూర్పవచ్చు నని స్పష్టపడియెడు. అనంతుఁడు తనకుఁ బూర్వకవులు ప్రయోగించిన యీప్రాసరీతులనేని గమనింపక త్రిప్రాస మని క్రొత్తగా రచించుట యవిచారమూలకమ యగును.

3. సమప్రాసము.

ఆయుపేంద్రుని బాడఁగాంచు టయుపాయ
మనెడు దీర్ఘాదులచట హ్రస్వాదు లయిన
నయ్యుపేంద్రుని బొడఁగాంచు టెయ్యుపాయ
మన సమప్రాస మగు నూఁదఁ జనదు రహల.

ఆ + ఉపేంద్ర=అయ్యుపేంద్ర-త్రికసంధి; ఋకారము నూష్మరేఫలు పరం బగునపుడు త్రికంబునకు హ్రస్వము, పరమైనవర్ణమునకు ద్విత్వము సంభవింపదు. ఇందు రహలు మాత్రమే గ్రహించి తక్కినవి (ఋ-శ-ష-స) విడుచుటకుఁ గారణ మేమియో గోచరింపలేదు.

4. బిందుప్రాసము-

పేర్చి పొల్లుకారంబు బిందు వగుచు
మీఁద నున్న ధకారంబు నూఁదఁ బ్రాస
బంధ మగుఁ *గృష్ణుఁ డుదయించినం <u>ధరిత్రి</u>*
యంతయును నిరుపద్రవం బయ్యె ననఁగ.

ఇందు సహజ బిందుపూర్వక ధకారమునకు ద్రుతయోగసాధ్య పూర్ణబిందుపూర్వక ధకారమునకుఁ బ్రాసమైత్రి చెల్లు నని చెప్పఁబడియె. ఇట్లనుటచే నితరములకుఁ జెల్ల దనియు దీనికే ప్రత్యేకత కలదనియుఁ దాత్పర్యమగును. "బిందుం ప్రవదంతి తం క్వచి త్కేచి" త్తను చింతామణిసూత్రములోని క్వచిచ్ఛబ్దమువలన వర్గయుక్కులు పరంబగునపుడును బూర్ణబిందు వగును.

కవిసింగరన్న త్రైశంకవోపాఖ్యానము-

క. కుంతీసు భైరవుని శితి
కంతు విశాలాక్షి దండకరు జాహ్నవి వై
కుంఠపతి గుహుని లోలా
ర్కుం దేవలు మీఱ భూవరుఁడు పొడగనియెన్.

అథర్వణాచార్యుల విరాటపర్వము-

ధాం ధమిత భేరికాధ్వానముం ధుళీనినాదమును ......

అనుప్రయోగము లక్షణపీఠమందుఁ జూపఁబడినవి. ఇట్లుండ నొకధకారమునకే చెప్పుట వింత.

౬. అర్ధబిందుప్రాసము-

సార్ధబిందువులై తేలిసట్టిపటల
కరయఁ బ్రాసంబు నిర్బిందువైనఁ జెల్లు
వీఁపు మూఁపులు మఱిశలమోపు లయ్యె
మాట లేటికి మేటితాఁ బేఁటి కనఁగ.

ఇందు పటలకు మాత్రమే ఖండాఖండబిందుప్రాస చెల్లు నని యనంతుఁడు వచించుట యబ్బురంబుగాఁ గన్పట్టెడి. పరుషసరళపరకము లైన యర్ధబిందులన్నిటికి ప్రాస చెల్లు నని యీప్రాక్కవిప్రయోగములు దెల్పెడు.

విరాటపర్వమున.

లోకము వంచింపఁగఁ దగు
చీఁకటి కే యొదవె నేమి సేయుదొ చెపుమా.

ఆదిపర్వమున.

తీఁగయుమ్మెల నూఁగుఁ జల్లనితియ్యమామిడిమోకలం
డాఁగుఁ బువ్వుల తేనె సోనలఁ దారుఁ గేలకిఁ జేరుఁ బు
న్నాగ పూగ మహాగ వీథుల నాట్యము ల్పచరించు నా
భోగ నాగలతాగృహంబుల భోగము ల్గనువేడుకన్,

వరాహపురాణమున.

ఆచింతామణి ముని తన
పీఁచ మడఁచు దాఁకనీక పృథులోభము చే.

శాంతిపర్వమున.

నే తెరువునఁ జరియించుచు
నే తెఱఁగున నైనఁ దప్పనేనియుఁ బురుషుం
డాతతనాకసుఖముగనుఁ
దోఁతెంచును మగుడ సద్బుధులవంశమునన్.

భాస్కరరామాయణము సుందరకాండమున.

బాఁతిగ నిడ గ్రైవేయక
మై తోఁచెదు నాకు నాదు ప్రాణేశుసరున్.

నృసింహపురాణమున.

ఆదియు మహిమయు నేర్పడ
నాదిపురుషుఁ డొకఁడ యెఱుఁగ నన్యుల కెఱుఁగం
గాఁ దరము గాదు కమలభ
వాది దివిజవంద్య మది మహాద్భుతము మహిన్.

వీని ననుసరించియే యప్పకవి.

'నిడుపులు నరసున్నలు దమ
కెడమనుగల కచటతపల కిలఁ బ్రాసములై

దోఁడరును నిర్చిందువు లో
ర్కాడ ఖంపాఖండసంజ్ఞ నిశశిశినయనా'

అని రచించెను.

ఇది యిట్లుండనిండు; మఱియొకయంశము. పటల కుదాహరణ మునఁ జతుర్థపాదమున 'తాఁబేఁటికి'అనుచోట టవర్ణపూర్వ మర్ధబిందు వుండనగుఁగాని తాఁబేలు శబ్దంబునకుఁ బరం బయిన యావశిభ క్తికంబగు టివర్ణమునకుఁ బూర్వ మర్ధబిందు వుండ దని వ్యాకరణము లుద్ఘోషించు చున్నవి. ఈప్రయోగం బనుసరించి చూడ నర్ధబిందువ్రగూడ నుండవలె నని తోఁచెడు.

౯. ఉభయప్రాసము. దీనికే యప్పకవి సంయుతాసంయుతప్రాసమనియె. లకారరేఫశ్లిష్టములగు డకారములు సంయుతముఁ బాసియుఁ బ్రాసమై త్రిం బొరయు నని దీని కర్థము.

పాఁడి మరగి బ్రతుకువాం డ్రిల వ్రేఁతలు
వాండ్రవెన్న లేలఁ దండ్రి! యనఁటి
పండుకొలఱకు వింతయిండ్లకుఁ బోకు కృ
ష్ణుండు నీకు బ్రాఁతె పండ్లు నిచట.

ఇట్టిప్రయోగములు కవిత్రయాది ప్రామాణికకవులగ్రంథంబు లం దెందును గానరా కున్నకి; అప్పకవియు నిది చెప్పినాఁడు; అనంతుఁ డిది గాక దీనివెనుక నీక్రిందిపద్యము వ్రాసెను.

రలయుతాయుత ప్రాసమార్గముఁ దలంచి
వాండ్ల లేఁజూపుమోములఁ దీండ్ర మారె
ననుచు రెంటను గూర్చిన నవువుఁ దక్పు
నండ్రు నిఖిలార్థవిదులైన దండికవులు.

పాఁడి-వాండ్రు, పండు-ఇండ్లు ఇట్టిప్రాసమే యరుదుగనుండ డ్రడ్ల ప్రాసము చెల్ల దని యేదండికవులు చెప్పిదరో.

7. సంధిగత ప్రాసము.

ధ్రువముగ సంధిజనిత రూ
ప విశేషప్రాస మనఁగఁ బరఁగు వకారం
బవిరళ వకారమగు న
య్యో వదాఅవహ లెఱుంగ ననఁగ ముకుందా.

ఇట్లనుటచేఁ గళలమీఁది పకారంబునకుఁ బ్రాసస్థానంబున వకారాదేశము నిత్యమని తేలుచున్నది. కవిలోకచింతామణి కర్తయు నిట్టి యభిప్రాయమునే తెలిపెను. సంధిగతప్రాస మనఁగా సంధివశమున నేర్పడిన యాగమాదేశవర్ణములు ప్రాసస్థానంబున నున్నవానికి మైత్రిం గూర్చుట; వకారమునకు మాత్రమే యనుటగాదు. అప్పకవీయమునఁ జూపుఁడు.

సంధిఁ గూడినవ్రాలు ప్రాసంబులైన;
నవియె సంధిగతాఖ్యల నమరుచుండు,
దివిజు లాశ్చర్యమొంద శౌరి వడవైచెఁ,
జెంగిపోనీక మధురలోనం గరి మున.

అనంతుఁడు దీనిపైఁ గళాద్రుతసంధులు సూత్రించి యాదుల కుదాహరణముగా నిచ్చిన.

'వాఁడు గను వాఁడు సేకొను వాఁడు డెక్క-
లాఁడు వాఁడు దపోనిధి వాఁడు వెద్ద'

అనుపద్యభాగమున 'వాఁడు + తపోనిధి' యనుచో దకారాదేశము వచ్చుట తటస్థించుచున్నది. 'నవికృతిశబ్దాత్పరత స్సాంస్కృతికానాం భవంతి గసడదవాః' అనునాంధ్రశబ్దచింతామణి సూత్ర ముండియు నిటు వ్రాయుటకుఁ గారణంబు శోచనీయము. 'అది మొదలుగాఁగ విష్ణుని మది నిల్పి యంతంతు నాకు మగఁ డగునని యిట్లు దపంబు సేయుచుండెద' ననునిర్వచనోత్తరరామాయణప్రయోగము ననుసరించి యుదాహరించి యుండునేమో. అందు తపశ్శబ్దభవము తబ మనియు

‘ఇట్లు దబంబు సేయుచుండెద’ నని పఠించిన నిర్బాధకం బగు నని యందురు. అట్టిమార్పును నిచ్చోటఁ బొసఁగ నేరదు.

(8) అచ్చుమీఁ దచ్చున యకార మాయజుంబు

కొమ్మ్మగలవాల్లు ప్రథమైనఁ గ్రుంకున చ్చు (63 వ పద్యము)

అచ్చుమీఁది + అచ్చు — ఇందు సంధినిషేధముగా నుండవలయును గాని వైకల్పికంబుగా భావింపవలసి యున్నది. ‘ప్రథమ + ఐన’ అనుచోటఁ దత్సమంబునకుఁ బరంబైన యచ్చునకు నిషేధము విహితం బయ్యు సంధిఘటన సమీచీనంబుగాఁ దోఁచదు. ‘ఏవార్థకస్య సంబోధనస్య చాతో న సర్వత్ర స్త్రీవాచకసమనామ్నోః కవిత్రయకృతౌ న దృశ్యతే సంధిః’ అను కారికాసూత్రముచేఁ దత్సమములకు సంధి కవిత్రయాది లాక్షణిక కవులమతము గా దనుట స్పష్టము. కాని యాధునికగ్రంథంబులందుఁ దత్సమములకు సంధి గోచరించెడు; అందుచేతనే కాఁబోలు ‘కుత్రచి త్సంస్కృతీ యో ఽ పి ప్రాణో వ్యత్రచ్యుతో భవే’ త్తనియుఁ జెప్పఁబడినది. మనయనంతుఁడు నథర్వణుఁడు ‘కుత్రచి త్సంస్కృతీ యో పి’ అనుట ననుసరించి యుండవలయు, లేకున్న నిట్టిప్రయోగంబునకుశరణం బుండదు.

(9) ఈత్రికారంబుకుఁ దృతీయ మెసఁగఁ గ్రింది — 46 వ పద్యము.

ఇందు షష్ఠీవిభక్తి కువర్ణకము పరంబగునపుడు నగాగమము నిత్యముగావచ్చి త్రికారంబునకు నని యుండవలయుఁగాని, నగాగమము సేర్చిన గణభంగంబు సంభవించును. ‘నఃకా’ అని చింతామణి. కొందఱు భారతమున సభాపర్వమున ‘సహదేవ నకుల వాసవసుత భీములఁ గ్రమమున నలువురఁ గౌరవేంద్రు కొక్కొక్క యేటున నుక్కివంబున నొడ్డి యోడి తన్నను నొడ్డియోటువడిన’ నను ప్రయోగము కల దందురు. కౌరవేంద్రు నొక్కొక్క, కౌరవేంద్రుఁ డొక్కొక్క యను పాఠాంతరములును గనఁబడుచున్నవి. భారతవిషయము సందిగ్ధముగా నున్నను

వసంతునికిఁ బూర్వకవులు నగాగమవిరహితముగా వాడియున్నారు చూడుఁడు. "కమలాసన విను నావిక్రమమునకు వెలపెట్టు దేని"—నిర్వచనో త్తరరామాయణము,

సంగరమునకు నుత్సవము కేఁగెదు క్రియ — ఉత్తరహరివంశము,

రామాయణము రచించి ప్రాచేతసుకున్-భాస్కరరామాయణము,

ఒక కోమటికి న్నిమధేంద్రుఁ బచ్చురుక్-నైషధము.

విన్నకోటపెద్దన విభక్తిప్రత్యయములు సేర్చుట కుదాహరణములు సెప్పిన పద్యమునందు 'సుతు చేత సుతుని చేతను సుతుకొఱకును సుతునికొఱకు సుతువలనన్ దత్సుతునివలన సుతుకొదవును సుతునికొదవు సుతునియందు సుతునందనఁగన్' (కావ్యాలంకారచూడామణి. ౯. ఉల్లాస. ౧౧౦) అని స్పష్టముగా నగాగమంబు లేమియుఁ జేర్కొన్నాఁడు. వీఁడువిక్కిలి మనయనంతామాత్యుఁడే తొలుతఁ దా రచించిన భోజరాజీయమున 'బలవంతపుఁబావము దెచ్చుకొంటి వేలా నగుఁబాటు కోర్చి'యని నగాగమవిరహితముగాఁ బ్రయోగించి యున్నాఁడు, గాన నిందు నగాగమము విభాష నగు ననియే గ్రహింపవలయు.

10 స్వరప్లుతోభయ వృద్ధ్యనుస్వర వికల్ప-81 పద్యము.

ఇందు సంయుక్తప్లుతవర్ణంబునకుఁ బూర్వరేఫము గురువు కావలసి యుండియు లఘువుగా రచింపఁబడి యున్నది. ఇది ప్రక్షిప్త మందురు; ఇది యెందులకుఁ బ్రక్షిప్తమగునో క్రింద వివరింపఁబడును. ఇట్టి లాక్షణికమతవిరుద్ధంబగు నభిప్రాయము వసంతుఁడు మఱియొకచోట స్పష్టముగా వక్కాణించి యున్నాఁడు.

ద్విత్వమున కాదివర్ణంబు తెనుఁగునందు
నూఁదకుండును వలసిన నూఁదియుండు
జానకీవల్లభుఁడు క్షమాశాలి యనఁగ
దశరథాత్మజుఁడు స్వామి ధాత్రి కనఁగ.

ఆంధ్రమున వ్యస్తపదములందుఁ బవాదిసంయుక్తమువలనఁ బూర్వపదాంతవర్ణము గురువు గాఁజాల దని యుండ ననంతునిపై పద్యము వింతలలో నొకండ గాఁ గన్పట్టెడి.

11. యతులు.

అనంతుఁ డిరువదినాల్గుయతులు వ్రాసిన ట్లప్పకవి 'భీమన పది చెప్ప ననంతామాత్యుఁడు చేసె వెనుక యతు లిరువదినాల్గు' అనుపద్యమునఁ జెప్పెను. ఛందోదర్పణమునఁ బరిశీలింపఁగా నిరువదినాల్గు యతులున్నవిగాని యంతకుముం దున్న యతిభేద వివరణ పద్యములం దర్థము దురవగాహంబుగా ననన్వయంబుగా నున్నది.

74. పద్య.

స్వరయతులు వర్గయతులును
సరసయతుల్ ప్రకట మైన సంయుక్తయతుల్
పొరిఁ బ్రత్యేకయతులు ననఁ
బరఁగును యతిపంచకంబు పంకజనాభా.

ఇందు యతు లేనువిధంబు లని చెప్పి తద్భేదంబు లిట్లు చెప్పినాఁడు.

స్వరయతులు ప్రాది కాకు
స్వర నిత్యసమాస యతులు వర్గయతులు ని
ద్ధరఁ బోలికవడి సంయుత
విరతి యనుస్వారయతులు వెలయు ముకుందా.

80. పద్య.

ప్రభునామాంతవిరతి యన
విభాగవిరమణమును భిన్నవిశ్రమమును గా
స్తుభధర వికల్పయతి యన
నభేద విరమణ మనంగ నైదు తెలుంగుల్.

81. పద్య.

స్వరప్లుతో భయ వృద్ధ్యనుస్వర వికల్ప
ప్రాద్యభేద సంయుత భిన్నప్రభు విభాగ
కాకు మాదేశ నిత్యద్యఖండవర్గ
చక్రటెక్కటి పోలిక సరసయతులు.

పై 78, 79, 80 పద్యములం జేర్కొనఁబడినయతు లుండుటచే తను, మొత్తము యతు లిరువదిరెం డగుటచేతను 81 పద్యము పై పద్య విభాగమునకు సంబంధించినది కాకుంటయే కాక, యిరువదినాల్గు యతు లన్న యప్పకవివాక్యమునకు భంగము తటస్థించును గాన నిది ప్రక్షిప్తమే యగును. మీఁదుమిక్కిలి యిందు (81 పద్యమున) నుక్తం బగు ప్లుత, ఉభయ, వృద్ధి, అఖండ, చక్కటియతులు ప్రత్యేకముగా ఛందోదర్పణ మునఁ గానరావు. ఉభయవళియందుఁ బ్లుతాఖండములు చేరును. ప్లుతము కాకుస్వరయతియందుఁ జేర్చినాఁ డనంతుఁడు. వేఱే యింక నుభయా ఖండములఁ జేర్కొనవలసినయావశ్యకత లేదు. వృద్ధియతి ననంతుఁడు చెప్పలేదు. ఇఁకఁ జక్కటియతి యనఁగా విభక్తిమువర్ణమునకే కాక శృంగసహితమకారమునకు పుఫుబుభులు యతిమైత్రి నొందు ననుట. ఇది సులక్షణసారమునఁ జేర్కొనఁబడినది గాని యనంతుని పోలికవడి యందే యిది గ్రాహ్యము కాఁగలదు.

ప్రకృతము 81 పద్యము ప్రక్షిప్తమని నిశ్చయింపఁబడుటచే దానిం దొలఁగించి తక్కినపద్యములం గూర్చి చర్చింతము. అం దిరువది నాలుగు యతిభేదములు లేకున్నను 'స్థితస్య గతి శ్చింతనీయా' యనుట ననుసరించి నాయభిప్రాయంబును దెలిపెదను.

యతిపంచకభేదములు :—

అ. స్వరయతులు - ప్రాది, కాకుస్వరము, నిత్యసమాసము. స్వరయతు లనుమాటలోనే గూఢస్వరము, ఋకారస్వరము, రీఫిరమము, ఇవళి,

అను నాలుగుయతులు గ్రాహక మగును; నిత్యసమాసయతిచే నిత్య యతి గ్రహింపవలె, అప్పుడు మొత్తము స్వరయతిలోఁ జేరి 9 అగును.

ఆ. వర్గయతి - పోలికవడి -2

ఇ. సరసయతి -1

ఈ. సంయుక్తయతి - అనుస్వారయతి; ఇందులోనివి రెండు గాక తద్భవ వ్యాజయతి, రేఫయుతయతి, మకారయతియును 3 కలసి 5 యతు లగును.

ఉ. ప్రత్యేకయతిక్రింద ప్రభునామాంతవిరతి, విభాగవిరమణము, భిన్న విశ్రమము, వికల్పయతి, అభేదవిరమణ- మని 5 విధములు. భిన్న విరతివంటిది దియతి, వికల్పముచే యుక్తవికల్పము గ్రాహ్యము. మొత్తము యతులు 7 అగును. ప్రత్యేకయతికే యొక్కటియతి య నియుఁ జేయుగాన దానిం గలుపుకొన్న 8 యతులగు.

ఈ ప్రకారముగా యోజించిన 25 యతు లగుచున్నవి గాని దియతి యని ప్రత్యేకముగాఁ జెప్పఁబడక భిన్నయతియందే మూలమున నుంటచే 24 కాఁగలను.

అట ఇకారాంతపదము మీఁదటి దికార
మది యనంగ నవ్వల భిన్నయతికిఁ జెల్లు
దివిజవిభవంబు శౌరిచేతి దియనంగ
నసుర ప్రాణంబు హరిచేతియది యనంగ. (123 పద్య)

12. ఋకారస్వయతి-

తెల్లముగ ఋకారము యణాదేశశక్తిఁ
గలుగు రేఫయిత్వమునందుఁ గదిసి యతికి
నట్టిరికి సీయేలతో నన్వయించు
నట్టి నత్త్వంబు లేదది హల్లుగాన

"ఇకోయణచి" సూత్రమువలన ఋకారమునకు య ణ్ణగు రేఫము గలుగును. అది యిత్వముతోఁ జేరియుంట కుదాహరణము— పితృ + ఉపస్థితము = పిత్రుపస్థితము; ఇందు దీ యున్నది; దీనికి ఈయేలలో

యతి పొసంగ దని పై పద్యము భావము. ఏల యతి యస్వయింపదో తెలియలేదు. తప్పక యతిచెల్లునట్టి సత్త్వంబుగలదు. ఈపద్యమునకు వేఱొండర్థము గలదేమో ?

12. ౠకారయతి-

మును ఋకార మీయేలతో నొనరి నట్లు
చేర దొకట యణాదేశ కారణమున
ఘనలకారంబ యగును ౠకార విరతి
క్లృప్తిలేను శౌఁగుణావళికి ననంగ.

ఋవలెనె ఇ ఈ ఎ ఏ లంగూడిసలళలకు చెల్లును. మఱియు ఋ- ఇ ఈ ఎ ఏలకుం గూడఁ జెల్లును, ఇది ౠకారమున కవి చెల్ల వని పైపద్యముభావము. దీనికిఁ గారణము శోచనీయము.

సీ. వినవయ్య కృతవీర్యుఁ డనుజనపతి తొల్లి...
అతనివంశమునవా రతిధనలుబ్ధులై
కృతవీర్యధనమెల్లఁ గ్లృప్తిసేసి (భారతము - ఆదిపర్వము - ౭. ఆశ్వాసము-133 పద్యము.)

పై నన్నయప్రయోగమున ౠలకు యతిమైత్రి హల్సంయోగమునఁ జూపఁబడినది. దీని ననంతుఁడు పరిశీలించ కుండును గాఁబోలు! ఇట్లు ౠకారమునకు ఇ ఈ ఎ ఏలకు యతిని మిత్రత్వ మందఁగల దని నాయాశయము. ఈవిషయంబును గూర్చి యప్పకవి యేమియుఁ జెప్పఁడయ్యెను. అనంతుని ౠవళింగాని నన్నయప్రయోగమునుగాని యతఁడు చూడలేదేమో.

14. రేఫయుతయతి-

ఆంధ్రలిపిఁ జొప్పడదు ఋకారాన్వితంబు
క్రొత్తగాదు కృష్ణుని వెన్నక్రుచ్చి యనఁగ
క్రుక్కఁ దతఁ డాజి నట్టివిరోధి నైనఁ
గ్రుమ్మ నన రేఫయుతయతి గూడుఁ గాన.

తెనుఁగున ఋకార ముండ దనియు ప్రుచ్చుమి ప్రుక్కు క్రుమ్ము మున్నగుపదములు రేఫయుతములే కాని ఋకారాన్వితంబులు గా వని పై పద్యమున కర్థము. ఇది యతి యెట్లు కాఁగలదు ? ఇట్టిస్థలములందు రేఫమైత్రిని బాటింపవలయునే కాని ఋత్వ మని భ్రమింపరా దని రేఫమైత్రి నుదాహరణముగాఁ జూపి యనంతుఁ డీపిరియొక యతిగా గణించెను. "పదాద్యంబులు ఋౠవర్ణంబులు రలతుల్యంబు" లనుటచేఁ దెనుఁగున ఋౠలు రహాలతో సమములై యుంటచే వానికి యతి మైత్రి నిషేధ మనుటకే యిది పృథక్కుగా వ్రాయుటకు హేతువై యుండును. ఇట్లు దెలియక కొందఱు కవులు ఋకారరేఫసంశ్లేషములకు యతిమైత్రి నుంచియున్నారు.

భాస్కరరామాయణమున నయ్యలార్యకృతయుద్ధకాండశేషము నందు - క్రూరార్ధచంద్రాస్త్రకృత్తోరుబాహులై (1448 పద్యము.)

ఇట్టిప్రయోగము దనకు ముం దుండుటచేతనే యనంతుఁడు రేఫయుతయతిని జేర్చియున్నాఁడు. శ్రీ గిడుగు వేంకట సీతాపతిగారిది యొకయతి భేదముగా నుండదని యభిప్రాయపడి దియతిని బృథక్కుగాఁ గ్రహించిరి. మూలమున రేఫయుతయతి యని యున్నది గాని, దియతి యని చెప్పఁబడక భిన్నయతి యందుఁ జేర్పఁబడినది (చూ-ఇందు 11-ఱ.) కాన దియతినిద్రోసి రేఫయుతయతిని గణించుటే సమంజస మని నాయభిప్రాయము.

15. ఎక్కటియతి-

భీమన 'మయురలవ' లని, విన్నకోటపెద్దన 'మరఱలవ' లని వ్రాసినారు. అనంతుఁడు 'మరఱళవ' లన్నాఁడు. పెద్ద-నానంతులకు లళలందే భేదము. యకారమునకు అహలు చెల్లుటచే ననంతుఁడు దానిని వదలెను. అనంతోక్తములు పై యక్షరములన్నియు నేకతరవళులు గావు గాని యనంతునియభిప్రాయ మిట్లుండు నని తోఁచెడి.

మాకు సాధారణహల్లు మిత్రంబు గానేరదు, బిందుపూర్వకత వర్గాంతస్పోష్మములే యతిమైత్రి నొందును గావున 'మా' ఎక్కటియతి యమ్యో. రఱ లేకతరవళులే యగును.

ధర నెక్కటివ ళ్లైతగు
శరమతిఁవలు, వానిలోఁ జెలంగును లాకున్
సరిళాయన విశ్రమ వే
శరమాధిప రెండునుం గలసి వర్తించున్. (118 పద్య)

లాకు సరియగుళాయనఁగా లళలు రెంటికి రూపాంతరము గల శబ్దములలోని లకార మని భావము. సంస్కృతమున లళల కభేదము, ళాంతములన్నియు లాంతములందే చేరును. వేళ (స్త్రీ) వేల; వేలాబ్ధితీరాబ్ధివృద్ధ్యోః కాలమర్యాదయోరపి - నానార్థరత్నమాల. కాలమనుటకు వేళయనవలసి యున్నను లళల కభేదముచే నిట్లు వ్రాయఁబడెను. 'ళల లకు భేదము లే దనుపలుకున ళాదోలఁగి యైదుపదులగువర్ణంబులు సంస్కృతభాషకు' నని చతుర్థాశ్వాసమున ననంతుఁడు చెప్పినాఁడు. లళ లకభేదముగా నున్నప్పుడుమాత్రమే యీవిధి పాటింపఁబడు నను నభిప్రాయము లేకున్న నిది యేకతర యతియందు గ్రహింపనేల? "కాకుస్వరయతి యగు నితఁడే కదలక జలధిఁ బవ్వళించె-ననఁగ" (96 ప) అను చోటఁ బవ్వడించె నని పఠించిన ళడయతికిశంక రాఁజాలదు.

మఱి 'వా' యన్ననో పై లకారమువంటిదే యగు నని భావించెదను.

ప్రకటసకారవకార, ద్వికముసకుం జను నభేదవిరతి నిశాట
ప్రకటమెరిసెరామునిపావకశరమునజనకసుతనెపంబువననఁగన్. (126 ప)

నెపమునకు నెవము రూపాంతరము. వకారరూపాంతరముగలిమిచే 'పా'కు 'వా'కు యతి చెల్లిన దని గ్రహింపవలయు. ఏతాదృశాభిప్రాయం బుండకున్న నేకతరవల్లందుఁ బైనింబేర్కొన్నయక్షరములఁ జేర్చుట పొసఁగనేరదు. భీమన చెప్పిన 'యా'కు నచ్చపు 'హా'కారంబు మిత్రం బగుటచే ననంతుఁడు వీడియున్నాఁ డని యిందువలనఁ దేలుచున్నది కదా!

సశేషము.

# ఒకమనవి.

౧. మూలానుసారముగా నాంధ్రీకరింపఁబడిన యముద్రిత వాల్మీకిరామాయణములు కొన్నియటనట నున్నటులఁ దెలియవచ్చుచున్నది. తంజనగరమందలి సరస్వతీమహాలులో నట్టి రామాయణ మొకటి కట్టావరదరాజకృతము చూపట్టుచున్నది. సామాన్యముగ మూలానుసారములగు రామాయణాంధ్రానువాదములు కన్పట్టుటలేదు. కావున భాషాభిమాను లీరీతి యాంధ్రానువాదముల ముద్రించి ప్రకటించినచో దేశమునకు భాషకు మహోపకారమగునని భావించుచున్నాము.

౨. సవరణలు—

పరిషత్పత్త్రిక 32 వ సంపుటము ౧-౨ సంచికలో ప్రకటితమైన శ్రీశ్రీ పీఠికాపురమహారాజావారి "తొలిపలుకు"లో కొలఁది ముద్రణప్రమాదము లేర్పడినవి. వాని నీక్రింద సవరించినరీతిని బఠింపవలయును.

పుట 63 "గర్జద్ఘూర్జరగర్వ" అను శ్లోకముక్రింద యాంధ్రానువాద మీరీతిగ సవరించుకొనునది.

ఓసింగభూపవరేణ్యా! గర్జించుఘూర్జరులగర్వములను పర్వతములను భేదించువాఁడవును, నేపాళరాజులను చీకట్లకు సూర్యుఁడవున్, కటువుగా నందడించు సౌరాష్ట్రులవలని యుపద్రవముల నడఁచివేయువాఁడవును గర్వించుచున్న కేరళరాజుల మాళులను పిండిచేయువాఁడవును లోకములకు నభయమిచ్చు దీక్షపూనినవాఁడవునగు నీకు బహుశ్రేయస్సులు కలుగుఁగాక.

పుట. 67-వ పుటలో 3-వ పంక్తిలో-

| తప్పు. | ఒప్పు. |
|---|---|
| సర్వజ్ఞులీక్రింది. | సర్వజ్ఞుఁడీక్రింది. |
| 17. పరోపకారసంపన్నులై. | పరోపకారసంపన్నుఁడై. |
| 18. శీలసంపన్నులై. | శీలసంపన్నుఁడై. |

# గ్రంథ బహుమానము.

---

శ్రీపీఠికాపురసంస్థానాస్థాన విద్వాంసులును, శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటు సంపాదకులును, ఆంధ్రసాహిత్య పరిషదధ్యక్షులును, సాహిత్య విశారదులునగు బ్రహ్మశ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రులవారమూల్యములగు సంస్కృతాంధ్రగ్రంథముల 350 టిని ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తకభాండాగారమునకుఁ బసదనంబుగ నొసఁగిరి. వానిలో నమూల్యములగు సంస్కృతగ్రంథములు గలవు- ఆంధ్రగ్రంథములలోఁగూడ నధునాతనములైనను నమూల్యములైనవి గలవు. శ్రీ శాస్త్రులవారి యభిప్రాయార్థము వచ్చినగ్రంథములు తాము స్వంతముగ నిలుపఁదగినవికూడ పరిషత్తున కొసంగుటచే పరిషత్తుపైనివారికిఁగల యవ్యాజ్యానురాగము పరిస్ఫుటమగుచున్నది- ఇట్టిగ్రంథము లొకప్రత్యేకవ్యక్తిగతము కాకుండ నేదేని సంస్థయందున్న వానియుపయోగ మినుమడించి, గ్రంథములు ప్రకాశమానములగునను మహోదారాశయముతో శ్రీ శాస్త్రులవారు పరిషద్భాండాగారమును తమ గ్రంథరత్నములచే నలంకరించుట యెంతయు ముదావహము-

ఇట్లు,

ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులు.

# గ్రంథస్వీకారము.

1. మునిత్రయచరిత్రము: సంస్కృతశబ్దవిద్యకు సంప్రదాయకర్తలగు మహర్షులు పాణిని కాత్యాయన పతంజలులు - వీరి మువ్వురచరిత్రములను మునిత్రయచరిత్రమను పేర బ్రహ్మశ్రీ కవిభూషణ, విద్వాన్ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిలవారు నిర్వచనకావ్యముగఁ దెలుఁగున రచించిరి. ఈగ్రంథము శ్రీమన్మహా మహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, వ్యాకరణసార్వభౌమ శాస్త్రరత్నాకర తాతా సుబ్బరాయశాస్త్రిలవారి కంకితము-ఆంధ్రవిశ్వ కళాపరిషత్పండితులగు బ్రహ్మశ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రులవారీగ్రంథమునకుఁ జక్కని పీఠికవ్రాసిరి.

గ్రంథమున నాలుగాశ్వాసములును నెనిమిదివందల డెబ్బదియైదు పద్యములు గలవు. ప్రాచీన ప్రబంధరీతులును ప్రత్నసంప్రదాయధోరణియు నిందుఁ గన్పట్టుచున్నది- పీఠికలో గ్రంథకర్తఁగూర్చియు, కవిత్వముఁగూర్చియు విశేషముగ వ్రాయఁబడినది- మూల్యము రూపాయి మాత్రమే. వలయువారు రామచంద్రపురము స్థానికోన్నత పాఠశాలాంధ్రపండితులగు గ్రంథకర్తగారికి వ్రాసినఁ బడయఁగలరు-ని॥ వే॥

---

2. రేణుకవిజయము: ఆంధ్రదేశమున వీరశైవమత పునరుద్ధరణమునకు బహుమహాప్రకార్యములు దీక్షతో సాఁగించుచున్న శివశ్రీ చిదిరెమఠము వీరభద్రశర్మగారు, తమ శివధర్మగ్రంథమాలలో పదియవ పుష్పముగ నీ రేణుకవిజయమును బ్రకటించియున్నారు శైవపంచాచార్యులలోఁ బ్రథముఁడును, ప్రసిద్ధుఁడును నగు నీ రేణుకాచార్యుని చరిత్రమును శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు నిర్వచనముగ నైదాశ్వాసములు నెనిమిదివందల యొక్క పద్యమును రచించిరి- రేణుకపథపథికులగు శ్రీ వీరభద్రశర్మగారి దివ్యమగు ప్రసక్తిగ్రంథ మాంధ్రదేశము ప్రసక్తిఁ గలిగించుకొనుటకు దారిచూపినది. కవితారచనముఁ గూర్చియు, కావ్యప్రశస్తినిఁగూర్చియు, కథనీయుఁడగు రేణుకాచార్యునిఁగూర్చియు విశేషములు పీఠికారూపముననున్న ప్రసక్తివలనఁ దెలియును గాన

గ్రంథము సికిందరాబాదు శ్రీ శివధర్మ గ్రంథమాలకు వ్రాసి తెప్పించి యందఱను జదువఁగోరుచున్నారము గ్రంథము ప్రశస్తమగు కాగితములపై ముద్రింపఁబడినది- వెల సులభము రూపాయిమాత్రమే. ని॥ వే॥

---

3. అమరుకమ్: శ్రీ వింజమూరి శివరామారావుగారు రచించినది' అమరుకుఁడను రాజశరీరమునఁ బరకాయప్రవేశవిద్యచేఁ బ్రవేశించియున్న శ్రీ శంకరభగవత్పాదులీగ్రంథమును రచించియుండిరను కింవదంతి శ్రీ శంకరుల సర్వతోముఖపాండిత్యమును గొనియాడుటకు వ్యాపించినదై యుండవచ్చునని వ్యాఖ్యాతలయభిప్రాయము. అయినను నీగ్రంథకర్తకీ గాథ యిష్టము. కానుకొలను అన్నమరాజు తోలుదొల్త నీయమరుకమును బదునాఱవ శతాబ్దిలో ననువదించిన ట్లున్నది. ఇటీవలఁ గీర్తిశేషులు శ్రీ జయంతి రామయ్యపంతులుగారును మఱికొందఱును నీశతకము నాంధ్రీకరించి ప్రచురించినారు. పలువు రనువదించినదే యైనను దీనినే మఱల ననువదించుటకు వీరికి గ్రంథమునందలి యభిమానము కారణము. అనువాదమునఁ గొన్నిచోట్టుల మూలములోని భావము మాత్రము గ్రహింపఁబడి కొంత స్వేచ్ఛ చూపఁబడినది. మచ్చునకొక పద్యము.

సుమశరుఁ డన్ననో విరహశోకము నొందెడువారి నొంచి దే
హములు కృశింపఁజేయు కఠినాత్ముఁడు; వాసరము ల్గుణించుదు
ష్టమతియుముండు; నీవును రుషామయువశ్యుఁడవోయి నాథ! జీ
వము లెటుదాల్తురో తలఁపవా నవపల్లవకోమలుల్ సతుల్. వే॥ రా॥

4. త్రయీమూర్తి: విద్వాన్ పాలెపు వేంకటరత్నముగారిచే రచింపఁబడినది. వివేకానందస్వామి దివ్యజీవితములోని రసవద్ఘట్టములు కవినాకర్షించి, జని, అంతర్వాణి, ప్రలోభనము, ఫలసిద్ధి మున్నగు శీర్షికలక్రింద వర్ణింపఁబడినవి. కావ్యమున నచ్చటచ్చట నాటకమునందువలె

"నరేంద్రుఁడొంటిగాఁ దనగదిలో సోఫాపై గూర్చున్నాఁడు;" "నరేంద్రుఁ డేమియు బదులాడలేదు" మొదలగు రంగనిర్దేశములును, అభినయసూచనలును క్రొత్తగాఁ గన్పించుచున్నవి. రామకృష్ణుని యాశ్రమారామవర్ణనలో సహజవైరము లుడిగిన సత్వములయు, తత్త్వవిచారణ మొనర్చు పక్షులయు వర్ణనములు సహజములే యయ్యును "బొండుమల్లియ కంచమున భార్యతోఁగూడి" అనుపద్యమునందలి భావముమాత్రము కొంచెము స్థలవిరుద్ధముగనున్నది. 'అస్త్రసిద్ధి'యను పాశుపతప్రాప్తి యీ గ్రంథమున కనుబంధముగాఁ జేర్పబడిన చక్కని ఖండకావ్యము. వే॥ రా॥

---

5. కుముద్వతీపరిణయము: ప్రబంధపక్కి ని ద్విభాషి సోమనాథశాస్త్రిగారిచే రచింపఁబడిన యైదాశ్వాసములుగల కావ్యము. కృతిప్రశంస, షష్ఠ్యంతములు, పురవర్ణనాదికము, అలంకారసామగ్రి, ఆశ్వాసాంతపద్యములు వీనియన్నిటిలో నీగ్రంథము సర్వథాపూర్వకవుల ప్రకృతులకుఁ బ్రతికృతియై యలరారుచున్నది. వస్తువు రఘువంశాంతర్గతంబగు కుశమహారాజ చరిత్రము. అందందు గ్రంథకర్త తత్తద్రసోచితములగు వర్ణనలు మూలకథకుఁ జేర్చియున్నాఁడు. దీనికిఁ గవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు వ్రాసిన పీఠికగలదు. వీ రనినట్లే గ్రంథమీకవికిఁ బ్రథమప్రయత్నమేయైనను బాలకుల కట్లుతోఁపక బహుగ్రంథనిర్మితియైనవెనుక వ్రాసిన గ్రంథమువలెనే తోఁచును. వే॥ రా॥

6. గీతామృతము: స్నేహలతా కవితాసంఘ పక్షమున శ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయుఁడుగారు రచించి ప్రకటించిన 47 పద్యముల చిన్నపుస్తకము. ఇందు గీతలలోని సారాంశభూతములగు కొన్ని శ్లోకములు తేటతెలుఁగున నెల్లరకు బఠించుట కవకాశముగలుగునట్లు వ్రాయఁబడినవి.

7. శ్రీ శారదాదేవిచరిత్ర, చిరంతనానందస్వామి విరచితము, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి. వెల. రు 1-4-0.

శ్రీ రామకృష్ణ పరమహంసకు సహధర్మచారిణియై తన యపూర్వజీవితముచే లోకమును బవిత్ర మొనర్చి, భక్తిచే నైతను పరమేశ్వరిగా పూజింపఁబడిన మహనీయవ్యక్తియగు శ్రీ శారదాదేవిచరిత్ర యీగ్రంథమున సులభమగు నాంధ్రభాషయందు రచింపఁబడినది. గ్రంథకర్తలు పాఠకులకుఁ జిరపరిచితులై శ్రీ వివేకానందులచరిత్రము నిదివఱలో రచించియున్నారు. శ్రీ శారదాదేవి జీవితవిశేషములు, ఆమె ప్రభావము, నిరాడంబరజీవితము, పారమార్థికచింత, సౌశీల్యాది సద్గుణములు, మొదలగు యమూల్యవిషయములు శ్రీ రామకృష్ణమఠము వారాంగ్లమునఁ బ్రకటించిన గ్రంథములనుండి గైకొనఁబడినవి. పురాణయుగమునకు భరతవాక్యమా ? నవీనయుగమునకు నాందియా యని శ్రీ సోదరి నివేదితవలనఁ బ్రశంసింపఁబడిన శ్రీశారదాదేవి పవిత్రచరిత్రమును దేశభాషలఁ బ్రకటించి శ్రీరామకృష్ణమఠమువారును, గ్రంథకర్తలును కృతకృత్యులైరని తెలుపుటకు సంతసింపుచున్నాము. వీ రింక నిట్టి గ్రంథములఁ బ్రకటించి దేశసేవ యొనర్తురుగాక.

8. Important Inscriptions from the Baroda State by A. Gadre. Price.5/7/- శ్రీ ప్రతాపసింహ మహారాజ రాజ్యాభిషేకగ్రంథమాలయందు రెండవ కుసుమముగ నిది ప్రకటింపఁబడినది. శ్రీ బరోడాసంస్థాన ప్రభువులు సంస్కృతగ్రంథావళి యందమూల్యమగు గ్రంథములను బ్రకటించుచుండుటయే గాక తమసంస్థానమునఁ బురాతన విజ్ఞాన (Archaeology) శాసన పరిశోధక సంఘముల నేర్పరచి యున్నారు. వీరిప్రయత్నములు సర్వదా ప్రశంసనీయములై యున్నవి. వీరి మార్గమున నితరప్రభువులును దమతమ రాజ్యములలోని శాసనాదికములను బ్రకటించినచో మనదేశమునకు మిక్కిలి యుపయోగకారిగనుండు

వని తెలుప నవసరము లేదు. ఈగ్రంథమునముఖ్యమగు పంచ్రొంపు శాసనములు మూలము, వ్యాఖ్యానము ప్రతిబింబముతోడను ప్రకటింపఁబడి యున్నవి. ఇవి దాటు శాసనములు నూతనముగఁ బ్రకటింపఁబడినవి. శేషించినవి పూర్వప్రకటితము లైనను నూతనవిషయములతోఁ జేర్పఁబడి యున్నవి. ప్రాచీన శాసనములలో ముఖ్యమగునది మహాక్షత్రపుఁడగు ప్రథమ రుద్రసేనుని కూలవాసరశిలాశాసనము. సంస్కృతభాషలో బ్రాహ్మీలిపియందు రచింపబడినది. శకసంవత్సరము 122 నాఁటిది. ఈచిన్న శాసనము చాల ముఖ్యమైన దగుట చేతను. ప్రాచీనమగుట చేతను నిటఁ జూపుచున్నాము.

వనిజకస్య- (అడ్డముగా వ్రాయఁబడిన భాగము.)

(నిలువుగ.)

రాజ్ఞో మహాక్షత్రపస్య స్వామి రుద్రసేనస్య

వర్షే 122 వై శాఖబహుల పంచమ్యామ్

ఇమాం శిలాలష్టి ఉత్థాపితా వనిజకస్య పుత్రేన

ప్రతిజీవితమ్ దత్తమ్ స్వమిత్రేహి నిజస్య.

తనమిత్రునికొఱకు స్వజీవితమును ధారవోసిన వణిజకుని కుమారుని జ్ఞాపకచిహ్నముగా నీశిలాశాసనము నెలకొలుపఁబడినది.

ఆరవశతాబ్దమునాఁటి కటచ్చురి వంశీయుఁడగు తరళస్వామి తామ్రశాసనములోని ప్రథమభాగము దొరకినది. ఇది పూర్వప్రకటితమగు బరోడామ్యూజియమ్ వారి సంక్షేప శాసనమునకుఁ బూర్వభాగమని గుర్తింపఁబడినది. ఈశాసనము సంస్కృత సమాస జటిలమై యాఱవ శతాబ్దమునాఁటి సంస్కృత భాషారచనమును విశదీకరించుచున్నది. ఇట్టి శాసనములు ప్రకటించి భాషకును, దేశచరిత్రమునకును నమూల్యమగు విషయముల సమకూర్చిన శ్రీ బరోడాసంస్థానాధీశ్వరుల మన మభినందింపవలసియున్నది.

9. హంససందేశము - భాషాప్రవీణ శ్రీ పెనుమత్స వేంకటేశ్వర శాస్త్రిగారి యనువాదము. ఇందు మూలమును శ్రీ శాస్త్రిగారి యనువాదమును ప్రకటింపఁబడినవి. మూలగ్రంథకర్తయగు శ్రీ వేదాంత దేశికులనుగూర్చియు, హంససందేశ కావ్యములనుగూర్చియు పెక్కు విషయములు పీఠికయందు పీఠికాపుర కళాశాలోపాధ్యాయులగు శ్రీ శ్రీ యి. వి. వీరరాఘవాచార్యులుగారు చర్చించియున్నారు. వీరి పీఠికవలన హంససందేశమునకుఁగల యాంధ్రానువాదములు, హంససందేశకవులు వారి యితరగ్రంథములు శ్రీరామకథాశ్రయములగు దూతకావ్యప్రశంసావిషయములగు యమూల్య విషయములెన్నియో తెలియుచున్నవి. శ్రీ శాస్త్రిగారి యాంధ్రీకరణము మృదువగు శైలిలో రచింపఁబడి మూలభావముల వ్యక్తీకరించుచున్నది.

మచ్చునకొక పద్యము.

కూరిమినిట్టు లేఁగికనుఁ గొందువు జన్మపు నేలదున్నుచో
సీరపుఁజాలు వెల్వడిన సీతను నీ చెలినోయి మిత్రమా
వారని ప్రేమనాకొరకె ప్రాణముమాని పతివ్రతాత్వమా
కారముఁగొన్నదో యనఁగ గాసిలుచున్న సతీమతల్లికన్.

---

10. శివపంచస్తవి: శ్రీ శివ ధర్మగ్రంథమాలయందు పదునొకొండవపుష్పము - ఇందు, శివపంచస్తవములనఁ బరగిన సంస్కృతస్తవములును, వాని యాంధ్రీకరణపద్యములును, దాతృప్రశంసయు, ప్రస్తుతమును, భక్తరంజనీ వ్యాఖ్యయు, ననుబంధమును, సాధుపత్రియును, గ్రంథమాలా గ్రంథప్రకటనము గలవు మూఁడువందల నలువది పుటలును, రెండు త్రివర్ణచిత్రములును మూఁడు ఛాయాప్రతిబింబములును గలవు. చక్కని తెల్లకాగితముపై స్ఫుటముగ ముద్రింపఁబడి గ్రంథము పసుపురంగు అట్టలతోఁగూడ సకల జనాకర్షణసమర్థమై విరాజిల్లుచున్నది- శివభక్తి ప్రబోధము గావించుచున్నది. కాగితపు కఱవురోజులలోఁ గన్నులకఱవు దీర నిట్టి గ్రంథమును నింత చౌకవెలకు (ఒకరూపాయి పావలా మాత్రమే !) నాంధ్రదేశీయుల కందఁజేసిన పండిత శ్రీ చిదిరెమఠము వీరభద్రశర్మగారికిని, శ్రీ దుంపల రామిరెడ్డిగారికి నాంధ్రులెల్లరును

గ్రుతిజ్ఞ తాబద్ధులు- శివభక్తిప్రబోధమునకును తోద్ధరణమునకు నీగ్రంథ మత్యంత సహాయకారికాఁగలదు.

గ్రంథమున స్తవములను భాషాంతరీకర్తల వివరణము నిటఁపొందు పఱుపఁబడినవి.

| పేరు. | సంస్కృతకవి. | ఆంధ్రీకర్త. |
|---|---|---|
| 1. మహిమ్నము- | పుష్పదంతుఁడు- | శ్రీ పన్నాల సీతారామ బ్రహ్మశాస్త్రి. |
| 2. మల్హణము- | మల్హణుఁడు- | శ్రీ వడ్డాది సీతారామాంజనేయకవి |
| 3. మలయరాజీయము- | మలయరాజు- | శ్రీ దేవులపల్లి సుబ్బరాయ శాస్త్రిలవారు. |
| 4. అనామయము- | దండి- | శివశ్రీ బండారు తమ్మయ్య గారు. |
| 5. హలాయుధము- | హలాయుధుఁడు- | శివశ్రీ పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు |
| 6. అనుబంధము- | | శ్రీ శృంగారకవి కంకట రామయ్యగారు. |
| 7. బిల్హణస్తవము- | బిల్హణుఁడు- | శ్రీ వింజమూరి లచ్చారాయకవిగారు. |
| 8. అనామయస్తవము- | దండి- | శ్రీ శృంగారకవి సర్వారాయుడుగారు. |

ఈ పద్యానువాదములన్నియు హృద్యములై యొప్పుచున్నవి- పైవారిలో 1, 3, 7, 8 సంఖ్యగలవారు కీర్తిశేషులు.

వీని కన్నింటికిని భక్తరంజనీవ్యాఖ్యయు గ్రంథమునకుఁ బ్రస్తుతమును రచించిన శివశ్రీ పండిత వీరభద్రశర్మగారి శివశ్రుతి స్మృతి పురాణేతిహాసనిరుపమానపాండితీవైదగ్ధ్యము గణనాతీతము - లోకోత్తరము. ఆంధ్రదేశీయులెల్లరు నీ గ్రంథము నాదరింతురుగాత ! వి॥ వే॥

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము ౩౨. { స్వభాను మార్గశిర-ఫాల్గుణములు. } సంచిక ౫-౬

## హాల్లోహాలశబ్దవిమర్శనము.

దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి.

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక 32 సంపుటము 3-4 సంచికలలోఁ బై శబ్దమునుగూర్చి శ్రీనిడుదవోలు వెంకటరావు, ఎం. ఏ. గారు కొన్ని ప్రయోగములఁ జూపి, ఆయాయి యాధారములను బట్టి "మునిఁగి తేలుట, తొట్రుపడుట, చీకాకుపడుట, ప్రవాహము, మత్తత, మనోన్మగ్నము" అను నర్థములతో నీపదము కావ్యముల వ్యవహరింపఁబడినది". అని వ్రాసియున్నారు.

ఈపదమున కిన్నియర్థములు గ్రహింపవలెనా? లేక వేఱొక యర్థము చెప్పవచ్చునా? ఈపదస్వరూప మెట్టిది? దీనిని సంస్కృత నిఘంటుకర్త లెందులకుఁ జూపలేదు? అనునదియే యీ వావ్యాసము నందలి విషయము.

చిన్నయసూరి తననిఘంటువునం దీపదము నొకచోట గ్రహించి భాగవతప్రయోగము (10 స్కం. 793 ప) నిచ్చియున్నాఁడు. అర్థముమాత్రము వ్రాసియుండలేదు. బ్రౌను నిఘంటువులోఁగూడ మనుచరిత్రలోనిపద్యము లక్ష్యముగా నీపదము చూపఁబడినది. మఱి మిగిలిన సంస్కృతాంధ్రనిఘంటువు లేవియు దీనిని గ్రహించియుండలేదు.

పరిశీలింపఁగా నీపదము ధ్వన్యనుకరణశబ్దముగాఁ బ్రయోగములు

చూచినవారికెల్ల గోచరింపకపోదు. ఈశబ్దము "అల్లకల్లోల, హాళాహళి, హాళహాళి, ఝుళఝుళ, ఝుళంఝుళ, ఝుళజ్ఝుళ" మున్నగు శబ్దముల వంటిది. ఇట్టి అనుకరణశబ్దములు కవుల కిచ్చవచ్చినట్లును, గణానుసారముగను బ్రయోగించుట, ఆంధ్రభాషలోఁ బ్రసిద్ధముగా నున్నది. ప్రకృతము లభ్యమైన ప్రయోగములందెల్ల ధ్వన్యనుకరణార్థము చెప్పినచోఁ జక్కఁగఁ బొసఁగుచునే యున్నది. చూడుఁడు.

"హల్లోహల యనెడి మదబంభరములయొక్క ధ్వను లొప్పఁగా" అని చెప్పినచో మనుచరిత్రపద్యము (మను 2-6) సరిపడును. లేదా! పూర్వానుగతముగా వచ్చుచున్న 'ఈహాత్ + లోహాల' అనియే చెప్పినచో నదియు సుసంగతమే. అప్పు డీపదమున కిచ్చుటఁ బ్రసక్తియే లేదు. కాని యిటఁ గొందఱు ఈహాధాతువు పరస్మైపదము గాన దీని శత్రంత రూపము శానచ్ రాగా 'ఈహామాన, అగునుగాని, ఈహాత్ కాదందురు. కాని 'అనుదాత్తేత్వలక్షణ మాత్మనేపద మనిత్యమ్, అను పరిభాషచే పైరూపమున్ను సాధువు కావచ్చును. ఇందులకుఁ దార్కాణగా "స్ఫాయన్నిర్మోకసంధిః, అని మురారికవిప్రయోగమును, "యుధ్యన్మేష మధ్యంబునన్" అని చిన్నయసూరిగారిప్రయోగమును గానవచ్చుచునే యున్నవి.

"హల్లోహల కలితయగుచు" అను భాగవతపద్యముకడఁ జిన్నయసూరి "హల్లోహలకంకణాళి యై సతి కంటే?" అను పాఠమును గ్రహించియున్నాఁడు. అప్పుడును సుకరముగా "హల్లోహలయను ధ్వని కల కంకణములతో" 'అనఁగా గలగలమను ధ్వనితోఁ గూడినకంకణములు గలభిల్లకాంత యని చెప్పవచ్చును. ముద్రితపాఠముకన్న నీచిన్నయసూరి పాఠమే సొగసుగా సరిపడినది.

ఇఁకఁ బాండురంగమాహాత్మ్యమునందుఁ గృతిపతికి విశేషణముగాఁ 'గంగాహల్లోహలవాగ్విలాస, అనియున్నది. ఇచ్చట 'గంగా

నదియొక్క హల్లోహలధ్వనివంటి మాటకారితనము కలవాఁడు, అని చెప్పినచో సరిపడును. ఇట వేగముగా మాటలాడునప్పటిధ్వని నదీఘోషవలె నెడనెడఁ దెగిపోక గంభీరముగా నున్నదని భావము. ఈపద్యమున 'రిపువర్ణ' అన్నచోట యతి పోయినదిగాన 'రిపువర్గ' అనియు 'హర్షాహవ' అన్నచోట 'హర్షావహ' అనియు 'హిమాహార్య' అన్నచోట 'హేమాహార్య' అనియు ముద్రణప్రమాదముల సవరించికొనవలెను.

ఇఁక దశావతారచరిత్ర పద్యమున "ప్రౌఢాంగనాకలనాదోదితపాహిపాహిముఖవాక్కల్లోల హల్లోహలా" (దశా. 9-433) అనియున్నది. ఇట "ప్రౌఢలగుస్త్రీలయొక్క మధురనాదముతో నుదితమైన పాహిపాహియనునవి మొదలగువాక్కులనెడితరంగములయొక్క హల్లోహల యనెడిధ్వని కలవాఁడా!" అనఁగా రక్షింపుము రక్షింపు మనెడి స్త్రీలయొక్క కలకలరవము తరంగకలకలమువలె నున్నదనిభావము. ఈపద్యమందు 'దృష్టిశ్రీ' అన్నచోట 'దృష్టశ్రీ' అనవలెను. లేనిచో యతిభంగము. 'స్షలదంతక్షత' అన్నచోట 'స్థలదంతక్షత' అనియు సవరించికొనవలెను.

ఇఁక నచలాత్మజాపరిణయపద్యమున "మల్లోపమల్లోపమోద్వల్లీలోల్లుఠనంబునకె బెనఁగుచుఁ హల్లోహలోల్లోలమై"(అచలా. 1-41) అనియున్నది. ఇట "మల్లుఁడును ఉపమల్లుఁడునుబోలె పల్లటీలతోఁ బెనఁగుచు హల్లోహల యనుధ్వనితో మిక్కిలి చలించునవియై యుల్లసిల్లుతుమ్మెదలు" అనిచెప్పికొన్నచోఁ జక్కఁగ నర్థము కుదురును. ఈపద్యమున ముద్రణస్ఖాలిత్యములు 'హల్లోహలోలోలమై, అన్నచోట 'హల్లోహలోల్లోలమై, అనియు 'హల్లీసకోలానకృత్, అన్నచోట 'హల్లీసకోల్లానకృత్, అనియు 'చెల్లీను, అన్నచోట యతిభంగమైనదికాన, పెల్లు + ఈను' పెల్లీను, అనియు సవరించుకొనునది.

ఇఁక రంగనాథకవి ద్విరేఫవర్ణదర్పణము మాత్రము నాకు లభ్యము కాలేదు. ఆపద్యము సరియగునర్థపుష్టి కలదిగాఁ దోఁపదు. కాని యీ కవి హల్లోహలశబ్దమున కర్థము గమనించి ప్రయోగించినట్లు కానరాదు.

"దయ యనెడి ప్రవహించు ప్రవాహముసంబంధమైనకరడము యొక్క హల్లోహలధ్వనితోఁ గూడిననిజవీక్షణగుణము కలవాఁడు" అని యర్థము తోఁచుచున్నది. అనఁగాఁ గృపాతరంగితమైనవీక్షణము కలవాఁడని దీని భావము. కాని వీక్షణగుణమునకును, కల్లోలహల్లోహలమునకును సంబాధము తృప్తిగా కుదురలేదు. కాన నిట నీయర్థ మంత సమంజసముగా లేదు. "హల్లోహలైః మగ్నైస్సగర్వైః" అని యాతఁడే వివరించికొనుటయుఁ గూడ నీపదము నాతఁడు స్వసంకేతప్రసిద్ధార్థముగాఁ బ్రయోగించికొన్నట్లు రుజువగుచున్నది. కాక ప్రయోగము లిట్లున్నప్పుడు తానాయర్థము వ్రాయుట కాతని కేయుపపత్తిగలదో చింత్యము. ఈ పద్యమందలి ముద్రణస్ఖాలిత్యములు "శావిక్షేత్రి' అన్నచోట యతిపోయినదిగాన 'శాలిక్షేత్రి' యనియు, 'కృపార్ఝులర్ఝులీ' అన్నచోట 'కృపార్ఝురజ్ఝురీ, అనియు సవరించుకొన్నచోఁ బద్యము సమన్వయించును. రెండవపాదమున 'ఝరీ—ఝలీ, 'రలయోరభేదః, అనుకొన్నచో యతి దోషమును లేదు.

మఱియు నీపదము "గంగాహల్లోహల, కల్లోలహల్లోహలా, ఝరీహల్లోహల" అనుచు నదీ, తరంగ, ప్రవాహార్థకపదపూర్వకముగాఁ బ్రయోగింపఁబడుటయు నీశబ్దమునకుఁ *గలధ్వన్యనుకరణార్థము స్పష్టమగుచున్నది.

బ్రౌనుదొరగారు వ్రాయించినయర్థముగూడ, తోఁచినరీతి వ్రాసినట్లున్నది. పాండురంగయందుఁగూడ 'వాఁడు గంగాప్రవాహమువలె నుపన్యసించుచున్నాఁడు, అను వ్యవహారమును బట్టి వ్రాయఁబడినట్లు తోఁచెడిని. అచలాత్మజాపరిణయవ్యాఖ్యాకర్తలుగూడ, ఉల్లోలశబ్దము

ననుసరించి ముందున్న హాల్లోహాలకు మత్తత యనునర్థము గుడికి బాఱెం దు హెచ్చుతగ్గుగ వ్రాసిన ట్లున్నది.

కాఁబట్టి యీపద మనుకరణార్థక మగుటచు, ఎవ రట్లనుకరించిన నట్లే దాని స్వరూపము మాఱకయుండుటను, దేవభాషాకవు లెవ్వరును దీనిని వాడియుండమిని, సంస్కృతనిఘంటువులు దీనిని జూపియుండలే దని యనుకొనవచ్చును. ప్రసిద్ధముగా నున్నమనుచరిత్ర పద్యమునకు వేఱుగా నర్థము చెప్పఁబడియుండుట చేతను, ప్రాచీనప్రయోగములు ప్రసిద్ధముగా గానరామిని, విరళముగా నున్న వైనను దృష్టిలోఁ బడకను అనుకరణశబ్దములకు భాషలో నంతప్రాముఖ్యము లేకుండుటను మన తెనుఁగునిఘంటుకర్తలుగూడ దీనిని పరిత్యజించియుందురని నాయూహ.

ఇఁక రంగనాథకవి పద్యమున, 'ఝుల్లజ్ఝలీ' అనునది 'ఝరత్ = ప్రవహించుచున్న, ఝరీ=ప్రవాహము, అని అర్థసిద్ధికొఱకు సవరించికొన వలసియుండుటచే 'ఝుల్లజ్ఝలీ, పదముగూడ నిచట సరియైనది కాదనియుఁ దేలినది. ఇంకను విజ్ఞులు పరిశీలింతురు గాక.

---

# కఱవు మొఱ.

ఆకుండి వెంకటశాస్త్రి

శా. కట్టా! యెంతటి ఘోరకాల మిది; భిక్షల్వెట్టఁగా దాతకుం
బుట్టె న్భీతి; ధనాఢ్యుఁ డైనవరె పెంపుల్మాని దీపంబులన్
బెట్టంజాలక యంధకారజలధి న్నిర్మగ్నుఁ డై యుండె; నీ
విట్టుల్ సూచియు నూరకుండుట ఘనంబె? వ్యాసనారాయణా!

శా. జంకుం గొంకును లేక వర్తకులు స్వేచ్ఛామూల్యము ల్వెట్టుటన్
డంకంబుల్ దమయొద్ద లేనిజను లేద్వార న్వస్త్ర మన్నంబు నే
వంకం జూచినఁ గానరా దకట! యెవ్వా రైన నన్నాళు లి
ట్లింకం బింకము వీడకుందు రిది మేలే? వ్యాసనారాయణా!

శా. చేరల్ నిండఁగఁ ద్రావునూనె యర ఘాసీ రమ్య రూపాయి కే
వారం జూచిన వెండి గన్పడను దేవా! కోడిగ్రుడ్డంతబం
గారంబే కఱవా? యటంచు మదిలో గర్వించి జీవించువా
రేరీ? పోయె సువర్ణ మెచ్చటికొ? తండ్రీ! వ్యాసనారాయణా!

శా. అయ్యో! భాగ్యము లొక్కటొక్కటియె క్షీణావస్థపా లయ్యెడిన్
'బియ్యం' బన్నపదంబె సున్న యగుచుండెన్ జూడఁగా, నంబరం
బయ్యెన్ వస్త్రము, పెచ్చు దేనికిని లే దాగాని యాఱన్న దే
డయ్యెంగా నొకగంట తగ్గులకు పెచ్చై, వ్యాసనారాయణా!

మ. మొదలే లేక దరిద్రుఁ డేడ్చె నెద మోముం జేర్చి, యార్జించిన
ట్టిది ఖర్చయ్యెను రొట్టెగా ననుచు నేడ్చెన్ మధ్యముం, డిప్పు తాఁ
బదిమానమ్ములనుండి సంచులను నింపన్ లే దటం చేడ్చె లో
భదశావిష్టుఁడు, మూఁడు నొక్కటియె దేవా! వ్యాసనారాయణా!

మ. అవురా! కాలవికార మెట్టిదొ, యవశ్యప్రాప్యనిస్సారవ
స్తువులం దెయ్యది కోరి పోయినను నిస్తుల్యవ్యయప్రాప్త మ
య్యె, విశేషం బిఁక నేమి యున్న, జను లెంతేఁ గోరుప్రాణమ్ములోఁ
జవుకై కానికి మాఱఁగాఁ దొడఁగెఁ గృష్ణా! వ్యాసనారాయణా!

మ. అహహా! వస్తువు నమ్మువానిమది నన్యాయమ్ముగాఁ బుట్టి ప్ర
త్యహమున్ గంటకు గంటకున్ బెరుగుదౌరాశ్యమ్ము, తత్క్రేతృదు
ర్వహఖేదంబును, దానిచేఁ గలుగుతద్వ్యాపారిపాపమ్ము గూ
డి హరీ! మూఁడును మిన్ను ముట్టెడును దండ్రీ! వ్యాసనారాయణా.

శా. నీ వాభారత మెందు వ్రాసితివొ? తండ్రీ! నీచరిత్రమ్ము భ
క్త్యావేశమ్మున వ్రాయఁ గాగితము శూన్యం బయ్యె; విద్యార్థివి
ద్యావిజ్ఞానపరీక్షయున్ ముఖపరీక్షాకారముం దాల్చె, న
య్యో! వార్తాశ్రవణ మ్మిఁకెట్టు లగునొక్కో? వ్యాసనారాయణా

# సర్వజ్ఞసింగభూపాలుఁడు-పోతన.

చిలుకూరి పాపయ్యశాస్త్రి.

ఈప్రభువరునకు సంబంధించిన కృతులను గూర్చియు, చారిత్రకాంశములను గూర్చియు నీవఱకు నాయూహాకొలఁది గొంతచర్చించియుంటిని. ఇప్పు డొకయంశమును మాత్రము చెప్పఁబూనినాఁడ. అది యేదియన రసార్ణవసుధాకరము, సంగీతసుధాకరము, రత్నపాంచాలిక, కందర్పసంభవము మున్నగు బహుగ్రంథముల కర్తలును, సాహిత్యమర్మజ్ఞులును, కవిపండితాదరణపరాయణులు నగుసర్వజ్ఞసింగభూపాలవరేణ్యులతో బమ్మెరపోతనామాత్యున కేపాటియు సంబంధము లేదనియుఁ దన్మూలమున శ్రీనాథ పోతన లిద్దఱు సమకాలికులు గా రనునదియును.

రసార్ణవసుధాకరాదిగ్రంథకర్త లగుసింగభూపాలురకు సర్వజ్ఞబిరుదము లేదని విమర్శకలోక మెంత యుద్ఘోషించినను తుట్టచివర కాపండితప్రకాండున కట్టిబిరుదము స్వర్ణాక్షరములతో నెలకొనినది. ఈనడుమ నడయారులైబ్రెరీవారు ప్రకటించినసంగీతరత్నాకరవ్యాఖ్యాన మగుసుధాకరమున—

శ్లో. అతిగంభీరే విషయే కతిపయవేద్యేత్విహ గ్రంథే

సమ్యగ్వ్యాఖ్యాకుశలః సర్వజ్ఞః సింహ(గ ?) భూపవైకః.

అనుశ్లోకమునందు 'సర్వజ్ఞ' బిరుదము సుస్పష్టముగ ఛందోనిబద్ధమైనది. నేఁటిదనుక నముద్రితములైనచమత్కారచంద్రికయందును, అమరకోశవ్యాఖ్యయందును నీప్రభువరున కీబిరుదము నెలకొనియున్నట్టు లీవఱకు వాకొని యుంటిని*.

నేఁటివఱ కీసింగభూపాలురకు 'సర్వజ్ఞ' బిరుదము స్పష్టముగ నుపలబ్ధముకాని కారణమున శ్రీనాథుఁ డీప్రభువరుని దర్శించె ననుటకు విమ

---

*చూ. ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక సం. ౩౦. సం. ౨. ౩.

" సం. ౩౧. సం. ౩. ౪.

ర్యకలోకము వెనుకంజవేసి పడరానిపాట్లు పడుచువచ్చినది. కవిసార్వభౌమ బిరుదభూషితుఁడును, వేమభూపాలునాస్థానమున విద్యాధికారియై వెలసినవాఁడును, తర్క-వ్యాకరణాదిబహుశాస్త్రవేత్తయు నగు శ్రీనాథుఁ డెవ్వనియాస్థానికిఁ బోయి "దీనారటంకాలఁ దీర్థమాడించితి" ఇత్యాదిగ శారదాదేవిని స్తుతించినట్లు గాని సింహాసనముఁజూలఁడయ్యెనో, యట్టిప్రభువ రేణ్యుఁడు సాక్షాచ్ఛారదామూర్తియై యుండవలెనుగదా ? అట్టి శార దామూర్తిత్వము రసార్ణవసుధాకరకర్తలకే గలదని సమకాలికులగు సంస్కృతకవులు వేనోళ్ల నుద్ఘోషించియున్నారు. మఱియుఁ జమత్కార చంద్రికయందలి యీక్రిందిశ్లోక మీభూపాలునివాగ్వైఖరి యనల్ప సాహి త్యశిల్పావధి యని మెఱుఁగించుచున్నది.

శ్లో. సంగీతక్రమచంక్రమ ప్రియసఖీ శృంగారసంజీవనీ
సౌజన్యద్రుమసారణీ సరసతాసామ్రాజ్యసింహాసనమ్.
శ్రీసింగక్షితిపాలశేఖరమణే ర్వైయాత్యఘంటాపథ
శ్చాటువ్యాహృతివైఖరీ విజయతే సాహిత్యశిల్పావధిః.

సంగీతరత్నాకరసుధాకరము, రసార్ణవసుధాకరము, కందర్పసంభవము, రత్నపాంచాలిక మున్నగు గ్రంథముల సింగభూపాలుఁడు రచించె ననియు నీశ్లోకమున సూచితమగుచున్నది.

రసార్ణవసుధాకరమునందలి యీక్రిందిశ్లోక మాప్రభువరునిసౌజ న్యమునకుఁ దార్కాణము.

శ్లో. నేదానీంతనదీపికా కిము తమస్సంఘాత మున్మూలయేత్
జ్యోత్స్నా కిం న చకోరపారణకృతే తత్కాలసంశోభినీ
బాలః కిం కమలాకరాన్ దినమణి ర్నోల్లాసయే ద్దక్షతా
తత్సంప్రత్యపి మాదృశామపి వచ స్స్యాదేవ సత్ప్రీతయే.

సర్వజ్ఞబిరుద మీప్రభువరునకు లేదనుకొనియే (వెలుగోటి వంశచరిత్రము ననుసరించి) పదవతరమునాఁటిసింగభూపాలుని కాలమును వెనుకకును,

రసార్ణవసుధాకరకర్తలకాలమును శ్రీనాథునికిఁ బూర్వమునకును నెట్టి యున్నారు. కాని యీప్రభువరుఁడు చిరకాలము రాజ్యము పాలించినట్లు లీశ్లోకము చాటుచున్నది.

శ్లో. అథ శ్రీసింగభూపాలో దీర్ఘాయు ర్వసుధా మిమామ్
నిజాంసపీఠే నిర్వ్యాజం కురుతే సుప్రతిష్ఠితామ్

కావున నీప్రభువరుఁడు రాజ్యపరిపాలన మొనర్చినకాల మిదమిత్థమని నిర్ణయింప నలవిగాదు. అదియునుగాక యీరేచెర్లవంశజులగుప్రభువులు చిరకాలము జీవించినట్లు వారికుమారబిరుదములే సాక్ష్యము నిచ్చుచున్నవి. అనఁగాఁ దాతలు చిరంజీవులై రాజ్యము పాలించుచుండ తుల్యనామములు గలమనుమలును పెద్దవారయి విద్యాశౌర్యముల వాసి కెక్కి యుండుటచేతనే యీబిరుదములు లభించియుండును. కావుననే రసార్ణవసుధాకరకర్తయగుసింగభూపాలుని,

"కుమారశ్రీసింగే జలధి రశనాం శాసతి మహీమ్"

అని చమత్కారచంద్రికలో విశ్వేశ్వరకవి పేర్కొనినాఁడు. అమరకోశవ్యాఖ్యయందు బొమ్మకంటి అప్పయార్యుఁడును,

"కుమార సింగభూపేన లక్ష్యలక్షణవేదినా"

అనియున్నాఁడు.

ఇటులనే బమ్మెరపోతనామాత్యుఁడు తాను రచించినభోగినీదండకమున నుదాహరించినసింగభూపాలుని "కుమారాన్నపోతావనీనాథసూనున్" అని పేర్కొనినాఁడు. కుమారాన్నపోతావనీనాథుఁడనఁగా రసార్ణవసుధాకరకర్తయగు సింగభూపాలుని కుమారుఁడగు అనపోతావనీనాథుఁడు. తాతగారగు అనపోతావనీనాథుఁడు జీవించియుండ మనుమఁడగు అనపోతావనీనాథుఁడును ప్రసిద్ధిగాంచి యుండుటచే, తొలుత నేర్పడినయీకుమారబిరుదమే తరువాత వ్యవహారములోఁ బ్రసిద్ధి కెక్కియుండఁదగు. సింగభూపాలురు, అనపోతనాయకులు పెక్కురుండుటచే వంశక్రమ మిటుఁ బొందుపఱచుచున్నాఁడను.




కావున భోగినీదండకమునఁ జేర్కొనఁబడిన సర్వజ్ఞసింగభూపాలుఁడు రసార్ణవసుధాకరకర్తలమనుమఁడే యగును గాని సుధాకరకర్త యగు సింగభూపాలుఁడు కానేరఁడు. మఱియు నీయంశమును 'రావుసింగక్ష్మానాథపౌత్రున్' అనుదండకమునందలివిశేషణము బలపఱుచుచున్నది. ఎట్లన శ్రీనాథ విరచితము లని ప్రసిద్ధికెక్కిన-

సీ. దీనారటంకాలఁ దీర్థమాడించితి
 దక్షిణాధీశుముత్యాలశాలఁ
బలుకుతోడై తాంధ్రభాషామహాకావ్య
 నైషధగ్రంథసందర్భమునను
బగులఁగొట్టించి తుద్భటవివాదప్రౌఢి
 గౌడడిండిమభట్టుకంచుఢక్కఁ
జంద్రశేఖరక్రియాశక్తి రాయలయొద్దఁ
 బాదుకొల్పితి సార్వభౌమబిరుద

గీ. మెటుల మెప్పించెదో నన్ను నింకమీఁద
రావుసింగమహీపాలు ధీవిశాలు
నిందుకొలువున నెలకొనియుండి నీవు
సకలసద్గుణనికురుంబ శారదాంబ.

క. సర్వజ్ఞ నామధేయము
శర్వునకే రావుసింగజనపాలునకే
యుర్విం జెల్లును నితరుని
సర్వజ్ఞం డనుట కుక్క సామజ మనుటే.

ఉ. తక్కక రావుసింగ వసుధాధిపుఁ డర్థుల కర్థమిచ్చుచో.

ఇత్యాదిపద్యత్రయమునందు రావుసింగమహీపాలుఁడు పేర్కొనఁబడినాఁడు. ఈతని మనుమఁడగు సింగభూపాలుఁడుగదా కావలయును దండకమునఁ బేర్కొనఁబడిన సర్వజ్ఞుఁడు. మఱియు దండకమునఁ బేర్కొనఁబడిన సర్వజ్ఞసింగభూపాలుఁడు రసార్ణవసుధాకర్తల మనుమఁ డని విమర్శకులు నిశ్చయించియే యున్నారు. ఈతఁడే రావు సింగక్ష్మానాథపౌత్రుఁడును కుమారాన్నపోతావనీనాథసూనుఁడును. శ్రీనాథుఁడు దర్శించినసర్వజ్ఞుఁడు రావుసింగమహీపాలుఁ డనఁబరగి సర్వజ్ఞబిరుద భూషితుఁడై రసార్ణవసుధాకరాదిగ్రంథకర్తయే యగును. విద్యావైభవమునఁగాని రాజ్యప్రాభవమునఁగాని శ్రీనాథుఁడు దర్శింపఁదగిన యర్హత మనుమనియం దున్నట్లు తెలుపుదృఢతరప్రమాణముగానరాదు. విద్యాప్రాభవముల నరకుగొనక రావుసింగక్ష్మానాథ సర్వజ్ఞ బిరుదము లున్నంతమాత్రాన నీమనుమనితో సంబంధమేర్పఱుచుట సంగతమును గాదు. కావున తాతయగు సర్వజ్ఞసింగభూపాలునితో శ్రీనాథునకును, మనుమఁడగు సర్వజ్ఞసింగభూపాలునితోఁ బోతనకును సాహితీసంబంధ మేర్పడుచున్నది. ఇట్లుచూడ నీయిరువురనడుమ రెండుతరములకాలవ్యవధానము గానవచ్చెడిని. అనఁగాఁ బోతన శ్రీనాథునకు నలువదిసంవత్సరములు తరువాతివాఁ డగును.

ఒకపక్షమున శ్రీనాథుఁడు పేర్కొనిన రావుసింగక్షమానాథుఁడును, దండకమునఁ బేర్కొనఁబడిన రావుసింగక్షమానాథుఁడును భిన్నులేయందురా? అపుడు 'కుమారాన్నపోతావనీనాథసూనుః' అనునది పొసఁగదు. ఈయుభయవిశేషణములపర్యాలోచనముచే శ్రీనాథుఁడు దర్శించినసర్వజ్ఞుఁడు రసార్ణవసుధాకరకర్తయు, పోతనదండకమునందు దాహృతుఁడైన సర్వజ్ఞుఁ డాతనిమఁడేయని నిశ్చయింపవచ్చును.

మఱియుఁ బోతనకు సర్వజ్ఞసింగభూపాలునితోఁ గల పరిచయమును దెలుపుచు నాతనికాలనిర్ణయమునకుఁ బ్రధానసాధనముగ నెన్నఁబడినగ్రంథము భోగినీదండకము. ఇందు వేఱొకచో 'పోచమాంబాలసద్గర్భసంజాతుపై' అని కలదు. ఈయంశమును నిందలిసర్వజ్ఞుఁడు రసార్ణవసుధాకరకర్త గాఁడని నిశ్చయించుచున్నది.

శ్లో. అన్నమాంబేతి విఖ్యాతా తస్యాసీ ద్ధరణీపతేః
దేవీ శివా శివస్యేవ రాజమాళే ర్మహోజ్జ్వలా.

అనురసార్ణవసుధాకరశ్లోకమును బట్టి రసార్ణవసుధాకరకర్త తల్లిపేరు అన్నమాంబ. రత్నపాంచాలికయందలి యీక్రిందిగద్యమును బట్టియు నిట్లే తెలియనగును.

"లలితకవితావిలాసచతురాననేన ... మాన్య మహిలాగుణవిశేషలీలా సదనోమాంబికా విదూర విశ్వంభరా విమలరత్నకందలేన శ్రీమతా శ్రీసింగభూపాలేన ప్రణీతా ..."

రత్నపాంచాలికా- ఆముఖమ్.

దండకమునందలిసింగభూపాలునితల్లిపేరు పోచమాంబ. ఇట్లు మాతృనామవ్యత్యాసమును బట్టి చూచినను పోతనకును రసార్ణవసుధాకరకర్తలగు సర్వజ్ఞసింగభూపాలురకును ఎంతమాత్రము సంబంధము లేదనుట నిశ్చితము.

భీమఖండము నందలి యీక్రిందిపద్యమునకును, భాగవతమునఁ బ్రహ్లాదచరిత్రమునందలి యీక్రిందిపద్యమునకును విశిష్టసామ్యము గాన

వచ్చుటయు పోతన శ్రీనాథునకుఁ దరువాతివాఁ డని తెలియఁజేయు చున్నది.

సీ. శ్రీభీమనాయకశివనామధేయంబుఁ
జింతింపనేర్చినజిహ్వ జిహ్వ
దక్షవాటీపురాధ్యక్షమోహనమూర్తిఁ
జూడంగనేర్చినచూపు చూపు
దక్షిణాంబుధితటస్థాయిపావనకీర్తి
చే నింపనేర్చినచెవులు చెవులు
తారకబ్రహ్మవిద్యాదాతయాదల
విరులు పూన్పఁగ నేర్చుకరము కరము
గీ. ధవళకరశేఖరునకుఁ బ్రదక్షిణంబు
నర్థిఁ దిరుగంగ నేర్చినయడుగు లడుగు
లంబికానాయకధ్యానహర్ష జలధి
మధ్యమునఁ దేలి యాడెడిమనసు మనసు.
సీ. కమలాక్షు నర్చించుకరములు కరములు
శ్రీనాథువర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచుచూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కుశిరము శిరము
విష్ణు నాకర్ణించువీనులు వీనులు
మధువైరిఁ దవిలినమనము మనము
భగవంతు వలగొనుపదములు పదములు
పురుషోత్తముని మీఁదిబుద్ధి బుద్ధి
గీ. దేవదేవునిఁ జింతించుదినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించుచదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడిగురువు గురువు
తండ్రి హరిఁ జేరు మనియెడితండ్రి తండ్రి.

వెలుగోటివంశచరిత్రమునందును, వెలుగోటివారివంశావళియందును లె క్కించినరీతిని దండకమునందలి సర్వజ్ఞసింగభూపాలుఁడు పదవతరము వాఁ డగును. రసార్ణవసుధాకరమునం దుదాహృతమైనవంశావళియే శా సనములకు సరిపడునదియై యున్నది. సుధాకరమునందలివంశావళికి సంబంధించినశ్లోకములు కొన్ని చమత్కారచంద్రికయందు నుదాహ రింపఁబడినవి. ఇట్లు గ్రంథస్థములై శాసనములతో సరిపడుశ్లోకముల యాధారమునఁ గాంచినను రసార్ణవసుధాకరకర్తలకుఁ బోతనతో నేపా టియు సంబంధము లేదని సుస్పష్టము.

ఈప్రభువరుఁడు రచించినరసార్ణవసుధాకర, సంగీతసుధాకరము లీవలనే ముద్రితములైనవి. ఈనడుమ శ్రీశ్రీశ్రీ పీఠికాపురాధీశ్వరులీ ప్రభువరుఁ డనల్పశేముషీవైభవముతో రచియించిన 'రత్నపాంచాలిక' యనునాటకము నాంధ్రానువాదముతోడను, విపులమగు పీఠికతోడ ను గూర్చి ప్రకటించి యాప్రభువరేణ్యులయెడలఁ దమకుఁ గలకృతజ్ఞ తాభరమును వెల్లడించియున్నారు. ఇంకను నాకవివరేణ్యునికృతుల న్నియు మఱుఁగుపడి నేఁడో రేపో సారస్వతరంగమున వెలివడుననుట నిశ్చితము. కాని యాప్రభువరునాస్థానిని నుండినవిశ్వేశ్వరకవి యాప్రభు వున కంకితముగ నొనర్చినచమత్కారచంద్రిక వెలువడిన యాఘనప్రతి భునికీర్తి యింతో ఽధికముగ లోకమున వన్నె కెక్కఁగలదు. విద్యానాథ విరచితమగు ప్రతాపరుద్రయశోభూషణము వెలువడుటచేఁ బ్రతాపరు ద్రునికీర్తి భారతావని నెల్లెడల వ్యాపించినట్లు లీచమత్కారచంద్రికా ప్రసారముచే సర్వజ్ఞసింగభూపాలునియశశ్చంద్రికలు దేశమెల్లెడ వ్యా పించి యాప్రభువరునిఁ గూర్చినయనేకనూతనాంశముల నందీయఁగల వు. కావున భాషాపోషకు లగుప్రభువరు లీకార్యభరముఁ దాల్తురు గాక యని సవినయముగ నివేదించుచున్నాఁడను.

# గ్రంథస్వీకారము.

1 ద్విపదభారతము:—ఆది సభాపర్వములు- తిమ్మయ్య, బాల సరస్వతులు రచించినది. పరిష్కర్తలు శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు. ఆంధ్రవిశ్వకళాపరిషత్ప్రకటితము.

ద్విపదభారతమును తిమ్మయ, సోమన, బాలసరస్వతి యను కవి త్రయము రచించెను. అందు నాదిపర్వము మొదలు ద్రోణపర్వమువఱకు సభాపర్వముదక్క మిగిలిన పర్వముల నాటింటిని తిమ్మయయు, సభాపర్వము బాలసరస్వతియు, మిగిలిన పర్వములను సోమనయు రచించిరి. వీరు 16 వ శతాబ్దాంతము ననో 17 వ శతాబ్దముననో యుండియుందురు. ఆంధ్రవిశ్వకళాపరిషత్తునందు ఆంధ్రోపన్యాసకులగు శ్రీ లక్ష్మీకాంతముగారు గ్రంథమును బరిష్కరించి విపులమగు పీఠికతో నీగ్రంథభాగమును బ్రకటించిరి. ఇట్టి గ్రంథముల ముద్రించుటకు విశ్వకళాపరిషత్తువంటి సంస్థలకే వీలగును. పరిష్కర్తలు విపులమగు పీఠికను జేర్చి, యందు గ్రంథకర్తల కాలము, కవిత్వలక్షణములు మున్నగువానిని జర్చించిరి. ఇదమిత్థమని నిర్ణయించుటకు వీలు కలుగకపోయినను దిమ్మనకాలము క్రీ. శ. 1600 లకుఁ జేరువగ నుండునని యూహింపఁబడినది. బాలసరస్వతి యతని శిష్యుఁడనియు నతనియందలి వాత్సల్యముచే సభాపర్వ రచన మాతనికీయఁబడెననియు నూహింపబడినది. సోమన కర్ణపర్వము మొదలుగ నాగ్రంథాంతము రచించుటయేగాక తిమ్మయ క్లుప్తముగా రచించి విడిచిన యరణ్యపర్వమును విపులీకరించెను. ద్విపదరచనమునకు వాఙ్మయమునఁ బ్రత్యేకస్థానము గలదు. సామాన్యజనులకు సులభముగఁ దెలియునటుల చిన్నమాటలతో రచింపఁబడి యొకప్పుడు గానమునకుఁ గూడ ననుకూలముగ నుండును. పద్యకవిత్వమునఁ గల ప్రౌఢశైలియు, వర్ణనాచమత్కారములు మొదలగునవి కొఱవడినను, చదువుట కింపుగా మృదుమధురముగ రచింపఁబడు ద్విపదకావ్యములుగూడ నున్నతస్థానమును వహించుచున్నవి. రంగనాథుఁడు, గౌరన, మున్నగువారి రచన లిందుకు తార్కాణములు.

ద్విపదభారతము మూలమునకు యథామాతృకము గాదు. కొన్నియుపాఖ్యానములు కథలు విడువఁబడినవి. సంభాషణాచాతుర్యము, రమణీయ మగుకథాకథనము, ప్రబంధవర్ణనములతో సమకూర్పఁబడియున్నవి. గ్రంథకర్తల వ్యాకరణవిశేషములు, క్త్వార్థక, తత్సమస్త్రీవాచకసంధులు, కలహార, ప్రయము మొదలగు వింతశబ్దములు, సర్పపేరు, కళ్యాణపీట మొదలగు వైరిసమాసములు మున్నగువానిని గూర్చి విపులముగ పీఠికయందు వివరింపఁబడినది. ద్విపదగ్రంథముల నిట్టి లక్షణవిరుద్ధములు పెక్కులు గలవు ఇట్టిగ్రంథమును బ్రకటించి విశ్వకళాపరిషత్తువారు ఆంధ్రభాష కమూల్యమగు సేవ నొసర్చియున్నారు. మిగిలినభాగములఁ గూడ త్వరలోఁ బ్రకటించి కృతకృత్యు లగుదురుగాక. వెల రు 10-0-0 గ్రంథమున సుమారు ఏడువందల పుట లున్నను, వెల యత్యధిక మనఁ జెల్లును. తమ కెంత ధనవ్యయమైనను, విశ్వకళాపరిషత్తువా రీగ్రంథముల సామాన్యముజనులకును, గ్రంథాలయములకు నందుబాటులో నుండునటుల బ్రకటింపవలయును. అట్లు విశ్వకళాపరిషత్తువారు మూల్యములఁ దగ్గించి గ్రంథప్రచారమునకుఁ దగు ప్రాముఖ్యము నొసంగుదురని యాశించుచున్నాము.

2. అష్టావక్రచరిత్రము:— కాకినాడ సూర్యరాయనిఘంటుకార్యాలయపండితు లగు శ్రీబులుసు వేంకటేశ్వర్లు, బి. ఏ. గారిచే రచింపఁబడినది. భారతమున నానుశాసనికపర్వమునఁ గలయష్టావక్రచరిత్రము నందలి స్వల్పేతివృత్తము మూఁడాశ్వాసముల గ్రంథముగా రచింపఁబడినది. ఉచితమగు ప్రబంధవర్ణనములు చేర్పబడినవి గ్రంథకర్త లీగ్రంథమును అష్టావక్రుని గురుభక్తి కనుగుణముగఁ దమ గురువుల కంకితమొనర్చిరి గ్రంథము సులభమై మృదుమధురముగ నుండునటుల రచింపఁబడినది. పెక్కు పండితాభిప్రాయములు గ్రంథప్రాశస్త్యమును విశదీకరించుచున్నవి. 'ప్రాచీనగ్రంథముల జీర్ణమగు' నాంధ్రభాషను గైకొని నూతనగ్రంథముల రసవత్తరముగ రచింప వీలగుననుట కిట్టి గ్రంథములే తార్కాణములు.

# ఛందోదర్పణ సమీక్ష.

## రావూరి దొరస్వామి శర్మకవి.

(అనువృత్తము.)

ద్వితీయాశ్వాసము.

(1) సమవృత్తములు-

(అ) శ్రీ, భా, విం, తుక్.

(ఆ) స్త్రీ రూ, పారుక్, ఘోరా, ఘూరీ.

(ఇ) వినయుం, బోనరిం, తునసం, తునసకుక్.

పై మూఁడువృత్తంబులందు గణములను బేర్కొనలేదు. పెద్దనాప్పకవులు శ్రీ వృత్తమునకుఁ దప్పఁ దక్కినవానికిఁ జెప్పినారు. గణములను దెల్పుటయే లక్షణమునకు ముఖ్యకర్తవ్యము.

(2) (అ) లాటీవిటవృత్తము- 102 వ పద్యము.

సగణంబులు నాల్గిటిపై మకయుల్ - సమ్యగ్భవంబై యనుదేరన్
బగలింటికి నేలిక యెవ్వఁడు నా - భావింపఁగా నయ్యె వసుల్
మిగుల స్మరఘస్మరం బగుశబ్దములన్ - విశ్రాంతిన్ లాటీవిటవృత్తం
బగు నిందుకళాధరసన్నుత నా - మాంకాశంకాతంకవిదారీ.

స- స- స- స- మ- త- య గణములు, యతి 13 అక్షరము. రెండవపాదమున గణభంగ మేర్పడుచున్నది. మూఁడవపాదమున యతిభంగము (మి- వి- యతి చెల్లదు.) ఒకవేళ మకారయతి యని యెంచినచో బిందుపూర్వకవకార ముండవలయుఁగాని 'శబ్దములన్ + విశ్రాంతి' అనుచోట నంతస్థపరకం బగుద్రుతంబునకుఁ బూర్ణబిందువు రాదు; సంశ్లేష మనియే దీని నెన్నవలెను. ఇట్టిప్రయోగ మొండు కావ్యాలంకారచూడామణిలోను గలదు చూడుఁడు.

చ. లసితములైన లేఁజెమరులన్ జెలువారెడి మేసి కాంతియున్
బాసఁగ విలోచనాంతములఁ బొంపిరివోయెడు వింతరాగము
న్వసుమతిగారవించుచు శ్రమంపడకుండిన నేలకల్గు ... (ఉల్లాస.44వ)

పెద్దనం జూచి కాంబోలు ననంతుఁ డిట్టిప్రయోగము సేసియుండును. దీనం జేసి 'వర్గయుక్సరళములు పరంబులగునపు డొకనొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడిమెడి (సంధి. 19 సూ) అనుబాల వ్యాకరణసూత్రంబునకు 'సరళస్థిరంబులు పరం బగునపు' డనుపాఠమును గల్పించుకొనవలసివచ్చును. ద్వితీయపాదగణభంగవిషయము ముద్రణస్ఖాలిత్య మనియెంచెదను. వనుల్ అను బహువచన మనవసరము. విశ్రాంతి యను పునరుక్తియుఁ గాదు. ఇందున్నట్లే యుంచి 'భావింపంగా నమ్మెవనుల్ దా' అని యొండె 'భావింపగా భాసురభంగిన్' అని యొండె సవరించుకొనవచ్చును. రెండవసవరణవలన యతిభంగము కూడఁ దుదినున్నద్రుతము సంశ్లేషమగుటచేఁ దొలంగఁగలదు.

(ఆ) అష్టమూర్తివృత్తము-

జా నొందన్ మనతాయుక్తిన్ సరభజల్ యాంతమై కుంజరయతిద్వయ మొప్పం
గా నిట్లింపెసఁగఁ జెప్పెం గవిజనం బష్టమూర్తిన్ ఘనసమామ్నాయ రీతిన్.

గణములు- మ- న- త- స- ర- భ- జ- య.

క్రిందిపాదమున గణభంగము; 'సమామ్నాయ' అని యుండుటచే మ- న- త- స- ర- భ- య- య గణములగును. ఇది లేఖకప్రమాదమగునేమో! 'ఘనసమాగమరీతిన్' అని సవరించుకొన్న సమీచీనంబగు.

(౩) సరసిజము.

మౌళిం బిల్లంగో లొత్త చేతన్ మఱియొకకరమున మణిమయంతయున్
బాలశ్రేణుల్ మ్రోల వసింపన్ బసుల నొదిగి చనుపనగలప్రభువున్
జాలం గొల్వంజాలిన కోర్కుల్ సఫలములగు నన సరసిజ మమరున్
బోలన్ బ్రహ్మన్ భోగినిరామస్ఫురదురుమతియనముబంనననసలున్.

ఇందు మొదటిమూఁడుపాదములందుఁ గ్రౌంచపదవృత్తంబువలెఁ బ్రాసయతి యున్నది గాని నాల్గవపాదమునఁ దప్పి యందులకు మాఱు యతి పడియున్నది. ఇతరలాక్షణికులు చెప్పినవి ప్రదర్శించెదను.

పెద్దన-

చాళుక్య క్ష్మాపాల వరేణ్యాశ్రయ మతయననిచయయుత ననసల్
చాలై యింపై ప్రాలఁ దనర్పన్ సరసిజ మగు నిలఁ జవులకుఁ గుదురై.

భీమన-

మారాకారా చారుచరిత్రా మతయున ననసన మహి యతిరచనన్
సారంబైనన్ సూరికవీంద్రుల్ సరసిజ మని విన జదివిరి సభలన్.

పై పద్యములందును బ్రాసయతి గలదు గదా, ఇఁక నప్పకవి యన్ననో 'సంబంధించన్ మత్సలు నానాసలు దశనిధియతి సరసిజము నకున్, గంబూర స్బృందాటవిలోనన్ గవిసికొనిన సుర కరువలిదను జన్ ...

అను సరసిజలక్షణమునఁ బ్రాసయతి చెప్పలేదు. క్రౌంచపద వృత్తమునను సైతము భీమన పెద్దనాదులు ప్రాసయతిం జెప్పిరి గాని యప్పకవి చెప్పఁ డయ్యె.

భారతము స్త్రీపర్వము ౨. ఆ. 37. ప.

సరసిజము.

శ్రీరమ్యాస్యం బారఁగఁ బెం పూర్జితముగ మణివిరచితమకుటములన్
దారుం జూపన్ సారవిభూతిన్ ధరణిపు లనిమిషధవనిభు లగుచున్
భూరిశ్రీతిన్ బూరెలఁ గొల్వన్ భువనవినుత మగుపోలుపు వెలయుము
న్నీరాజుం డన్ దారుణదైవం బిటువఱుచునె తుది నితనిఁ గటకటా.

ఇందుఁ బ్రాసయతి యున్నది గావున సరసిజమునకు రెండుయతు లేకాక ప్రాసయతికలిమియుఁ బ్రాచీనలాక్షణికమత మగునట్లు కన్పట్టెడి. అందుననే యనంతుఁడు ప్రాసయతిం బెట్టినాఁడు; చతుర్థపాదమున

ప్రాసభంగ మనకుం గారణము మృగ్యము. 'పోఁడి బ్రహ్మవ్యాళవిరామ స్ఫురదరు' అని సవరించిన నిర్బాధకం బగును.

(4) * అర్ధసమ విషమవృత్తములు:-

ఇవి యైదువిధములు.

(i) స్వస్థానార్ధసమము-ఒకేఛందమునఁ బుట్టిన రెండువృత్తములఁగొని సగ మొకతెఱఁగు వేఱుసగ మొకతెఱఁగుగాఁ గాని, సమపాదములొక తెఱఁగు విషమపాదములు మఱియొక తెఱఁగుగాఁ గాని వ్రాయుట. మఱియు నొకపాద మొకవిధము తక్కినమూఁడు మఱియొకవిధ ముండవచ్చు.

(ii) స్వస్థానవిషమము-ఒకేఛందమునఁ బుట్టిన నాలుగువిధములైన వృత్తములతో నాలుగు చరణములు రచించుట.

(iii) పరస్థానార్ధసమము-భిన్నచ్ఛందములకుఁ జేరినవృత్తముల రెంటింగొని సమాంఘ్రులొకదానితోను విషమాంఘ్రులు మఱియొకదానితోను విరచించుట.

(iv) పరస్థానవిషమము-భిన్నచ్ఛందములకుఁ జేరిన రెండు లేక మూఁడు వృత్తములఁ గైకొని యొకపాద మొకతెఱఁగు తక్కినమూఁడు వేఱొకతెఱఁగుగాఁగాని, రెండుచరణములు భిన్నభిన్నములుగాను, మఱి రెండుచరణములు వానికి భిన్నమగు వృత్తములోను జెప్పుట.

(v) సర్వపరస్థానవిషమము-భిన్నచ్ఛందములకుఁ జేరినవృత్తములతో నాలుగుపాదములందు నాలుగువిధములుగ సర్వము విపరీతముగా రచించుట. ఇఁక ఛందోదర్పణములోని కొన్ని క్లిష్టసమస్యలు.-

(క) అంగజాస్త్రము-స్వస్థానవిషమ వృత్తమునకుఁ జేరిన దని చెప్పఁబడియె.

భూరి భమంబుల్ పొందు సగం బిం
పారఁగ నర్ధంబై యట సామున్
శౌరీ విస్మసజంబు గాంతమై
యారూఢం బగు సంగజాస్త్రమున్.

అనంతుఁడు పై పద్యమున సగము 'భ- మ- స- గ' గణములలోఁ, జెఱిసగము 'మ- స- జ- గ' గణములలో నుండు ననుచున్నాఁడు. 'ఒక్క ఛందంబున నాఁగఁగాని పాదముల్ వేఱైన స్వస్థానవిషమ మయ్యె'నని యనంతుఁడే యుద్ఘోషించినాఁడు; గాని స్వస్థానార్ధసమవృత్త లక్షణము ప్రకారము వ్రాసి పైవృత్తమును విషమమందుఁ జేర్చివేసెను.

అప్పకవి యంగజాస్త్రమునకు నాల్గుచరణములందుఁ గ్రమముగా రుగ్మవతి, శుద్ధవిరాటి, పణవము, మయూరసారియను ఛందములఁ బుట్టినవృత్తములను బేర్కొనియె.

(చ) వరాంగి.

సత్పదాబ్జా జతజల్ గగల్ బంధురంబగున్ రెంటఁ జతుర్థకాంఘ్రిన్
గారాముతోఁ దాజగగల్ వరాంగిన్, హరార్చితా మూఁడవయంఘ్రి
నొందున్.

ఇందు 1, 2, 4 వ చరణములందు నుపేంద్రవజ్రాచ్ఛాయ, 3 వచరణమున నింద్రవజ్రాచ్ఛాయ నడచుచున్నవి. అప్పకవిమతమున నిదియు స్వస్థానార్ధసమమే యగు నైనను అనంతుఁడు, ధరనొకటియు మూఁడును నగుచరణంబులు మఱి ద్వితీయ చాతుర్థిక విస్ఫురితాంఘ్రులుఁ దమలోనను, సరియగు నర్ధసమవృత్తచయమునఁ గృష్ణా! యని వందలించుటచేఁ బైయభిప్రాయమునకు భిన్నం బగునది యతనిమతమున స్వస్థానవిషమమే యగు నని యూహింపవచ్చును.

అప్పకవి దీనినే కాంబోలు వారాంగి యనియె. దానికి వరుసగా నింద్రవజ్ర, ఉపేంద్రవజ్ర, గీతాలంబనము, వాతోర్మి యనువృత్తములు నాల్గుచరణముల నొప్పును.

(ట) నదీప్రఘోషము-ఇదియుఁ జైవరాంగివలె నున్నది.

ప్రథమచరణమున స్రగ్విణియుఁ, దక్కినమూఁడంఘ్రులందు వంశస్థమును నడచు నని యనంతుఁడు; అప్పకవి నాల్గుచరణములఁ గ్రమముగా స్రగ్విణి, వంశస్థము, భుజంగప్రయాతము, ఇంద్రవంశము నడచు ననియె.

(త) రథగమనమనోహరము-ఇది కరస్థాన విషమవృత్తము.

ఇందు 2 వ చరణము న- జ- జ- ర- య;

1, 2, 3 చరణములు న- న- ర- జ- గగ.

అనంతుఁడు-

రథగమన మనోహరంబు రెండవంఘ్రిన్
బ్రథితంబగు నజజంబు రప్రయుక్తయంబుల్
బ్రథమపదమునందుఁ బై నగంబునందున్
గథిత ననరజంబు గద్వయంబుఁ గృష్ణా.

అప్పకవి-

గ్రథితనయుగర ల్జగంబులుం బొసంగం
బ్రథమతృతీయ చతుర్థపాదము ల్వచింపన్
విధిదశయతు లొందివింతగా నజార్యల్
రథగమన మనోహరంబగున్ ధరిత్రిన్.

రెండవచరణమున, 'న- జ- జ- ర- య' అనియున్నది; అనంతుని కన్న నొకగణము భిన్నము. అనంతుఁడు 'న' అప్పకవి 'న'

(థ) వీణారచనము ఇది సర్వపరస్థాన విషమవృత్తము.

వీణారచనంబయ్యె భుజిన్ తయసాగల్
బాణప్రహరా తజనభ భవ్యగగంబుల్
చాణూరహరా తజనభనల్ ప్రకటయతిన్

| అనంతునిమతము. | పెద్దన (విన్నకోట) |
| --- | --- |
| 1. త- య- స- న- గ | 1. త- య- స- న- గ |
| 2. త- జ- న- భ- గగ | 2. త- స- స- స- గగ |
| 3. త- జ- న- భ- స | 3. త- జ- న- భ- స |
| 4. భ- న- న- భ- స | 4 భ- స- న- జ- ర. |
| **అప్పకవి.** | **పెద్దన (చిత్రకవి)** |
| 1. త- య- స- న- గ | 1. త- య- స- న- గ |
| 2. త- జ- న- భ- గగ | 2. త- జ- న- భ- గగ |
| 3 త- జ- న- భ- స | 3. త- జ- న- భ- స |
| 4. భ- న- న- జ- న- గ | 4 భ- న- న- జ- న- గ. |

ఇట్టి పరస్పరభేదము లున్నను అప్పకవి లక్షణము నాల్గుపాదము లందు నాల్గు భిన్నచ్ఛందము ల నుండి కలిగిన వృత్తములలోఁ గన్పట్టెడి అనంతాప్పనకు నాల్గవపాదమునఁ గొంతభేదము గనఁబడుచున్నది. మీఁదుమిక్కిలి తృతీయచతుర్థచరణములందు నొకేఛందమునఁ బుట్టిన వృత్తము లున్నవి. ఎట్లు నొకేఛందమునఁ బుట్టినను భిన్నవృత్తము లగుటచే నవియు వేఱే యగు నని భావించి యనంతుఁడురచించియుండును. అవి రెండు సమానగణములు గలవృత్తమైనచోఁ బరస్థానవిషమ మగును; అట్లు లేదుగాన నిదియు సర్వపరస్థానవిషమవృత్తము కావుట సమంజస మనియే యంగీకరింపవచ్చు. గణములభేదమునకుఁ గారణము తాళపత్రంబులం దక్షరము లోపించుటచేతనో శిథిల మగుటచేతనో యయి యుండును.

(5) దండకము.

సిరి నేలు రసికుండు శ్రీవత్సవక్షుండు ... ... ... ... ... ... ...
పెద్దల్ సకారంబుతో సంగతంబై నహం బాది నొందంగ, దకారాదిగానైన లోనెల్లచోటం దకారంబులం బెల్లుచెందంగ గకారావసానంబునై దండకాకార మేపారఁ గీర్తింతు రెల్లప్పుడున్. (135 పద్య)

ఈలక్షణముచే సనహాలతో వరుసగాఁ జేర్చి కాని, లేక తగణము తోఁగాని యారంభింపవలయు ననుసవార్థము సంభవించును. అశ్లే :—
సీ: నేలురసికుండు అను ప్రారంభము తెల్పుచున్నది. ఇట్లనంతుఁడు
శిక్షించుటకుఁ బెద్దనభీమనలు కారణభూతులుగాఁ దోఁతెంచెదరు.
కావ్యాలంకార చూడామణి.—

'కృతి నాది సనహంబు లొండెం దకారంబు లొండెం బ్రకల్పించి ... ... ... ... ...' (అచ్చులో సనహంబు లని యున్నది గాని యుదాహరణ ప్రకారము సనహము లనియే యుండును)

భీమన 'అమరంగ సనహంబులం దాదిగా నొండెఁ గాదేని యాదిఁ దకారంబుగా నొండె ... ...' అని వ్రాయుటయు, లక్ష్యమును సనహాలతో మొదలుపెట్టుటయు నీసంశయమునకు హేతువై యనంతుని భ్రమింపఁజేసియుండును. సనహాలలో నేగణములోఁగాని యారంభింపవచ్చు; లేదా తగణ ముంపవచ్చు. అప్పకవి 'విద్వాంసులెల్లఁ హకారంబె కానీ నకారంబెకానీ సకారంబెకానీ వచింపం దగు న్మొందుగా నిందుఁ గాదేని యాదిం దకారంబుగల్పించి... ... ... ...'అని చెప్పెను తృతీయాశ్వాసము.

(1) ఎత్తుగీతి-

అదిప్రాసంబు హరియు, నాదిత్యయుగము నగుచు
నీదెస యతుల గెత్తు, గీదియ నెగడుఁ గృష్ణ.

దకారప్రాసనిర్బంధముచే గీతిశబ్దమునకు మారు గీది యుంచవలయు.

'సూ॥ ద స్తస్య శౌరసేన్యా మఖావచోస్తాః; వృ- అనాదేర చః పర స్యాసం యుక్తస్య తకారస్య దః స్యా చ్ఛౌరసేన్యామ్' అను సూత్రముచే నప్పకవి మత మనుసరించి యిది గీతి శబ్దమునకు శౌరసేని భాష నైనతద్భవము గాఁగలను. గీది + అ = గీదియ-ఏవార్థకముగా అకారమును బరిగణింపవలె. గీదియు యను శబ్దమే వికృతి యని చిహ్నము

నకుఁ జిన్నయ'వర్ణమునకు వన్నియువలెను గ్రహింపవచ్చును. గీదిశబ్దంబు శబ్దరత్నాకరాది నిఘంటువులందుఁ గానరాదు. శబ్దరత్నాకరకారుఁడు తానొసంగిన గృహీతగ్రంథంబులందు ఛందోదర్పణమును వ్రాయకుంటం జేసి యతని కీపదమును గ్రహించుట వీలుపడదయ్యె నని యెంచ నగును. అనఁగా నతఁ డీపదమును జూడలే దని భావము.

(2) తరువోజ

ముగురుజిష్ణులు త్రయీమూర్తియు మఱియు ముగురుజిష్ణులు త్రయీమూర్తియుఁ గూడి
యొగిచుండ గిరియతి యొక్కొక్క చరణ మునకగ సేయింప నుజ్జ్వలం బగుచు... ... ... ...

ఇందు గిరియతియనఁగా నేమియర్థమో! రెండు రెండుగణముల పైమూఁడుచోట్ల యతు లుండవలయు నని తరువోజలక్షణము "ఒగిరెంట యతులు మూఁడొక్కొక్క చరణమునకగ' యని సవరించుకొన్నఁగొంత మే లని తోఁచెను.

(3) త్రిపద.

సరవిఁ బ్రాసయు నొంది సురపతు ల్నలువురు,
నారియు వైకార్యులు గలియ,జరఁగ నిప్పగిది నొప్పుఁ ద్రిపద.

ప్రథమపాదమున 4 ఇం, ద్వితీయమున 2 ఇం × 1 సూ, అట్లే తృతీయము. అట్లే తృతీయపాదమున గణభంగ మేర్పడుచున్నది 'జరగు నిప్పగిదియై త్రిపద' అను పాఠమును జేర్చుకొన్న నిర్బాధకం బగు. ఛందోదర్పణమూలమునఁ గలతప్పొప్పులపట్టిక యందు 'జరగు నిప్పగిది నొప్పుఁ ద్రిపద' రెండుసమాపకక్రియ లుంటచే నేమో తప్పని, 'జరగ నిప్పగిది' యొప్పుగా దిద్దిరి గాని యీగణభంగమును గమనింపరైరి.

త్రిపదం గూర్చి భీమనపెద్దనలు భిన్నములుగా లక్షణములం జెప్పిరి ఇం దొక్కచోటనే కాక యనేకస్థలంబుల భీమనపెద్దనల లక్షణము భిన్నముగాఁ గన్పట్టెడిఁగాని వారివిషయంబులం గూర్చి యొండొకయెడ విస్తారంబు చర్చింపఁ దలఁచితిని గాన నక్కార్యము నిందు మానెదను.

(4) చౌపదము.

కలసి చతుర్లఘుగణములయందు
నలిఁ ద్రిగణంబై నగణము వొందు
నలరు గణద్వయయతి గోవిందుఁ
బలుకఁ గృతులఁ జౌపద చెలువందు.

ఇందుఁ జతుర్లఘుగణత్రయముపై నగణము వ్రాయవలె నఁట, లక్షణమునఁ జెప్పకున్నను నంత్యప్రాస మున్నది. భీమనపెద్దనలు చతుర్లఘుగణములు (భ- స- గా- నల) నాలు గుండవలె నని యంత్యానుప్రాసంబును విధించిరి. అప్పకవి భీమనపెద్దనలమత మనుసరించి గణములం బేర్కొని యంత్యానుప్రాసమును మాత్రము పరిత్యజించెను. అనంతునిది వీనికి భిన్నముగా నున్నది. (చతుర్లఘుగణములందుఁ ద్రిగణంబు + ఐ, నగణము వొందు నని పై పద్యమున కర్థము చెప్పవలె; నవిద్రిగణముపై నగణము వొందు ననినచో సుగమముగా నుండు నని వ్రాయాశయము) మఱి యిందు నగణ మని లక్షణమునఁ గలదు. లక్ష్యమున హగణ మున్నది. సూర్యగణ మన్నచో నిర్బాధకం బగును.

(5) వితాళచౌపద.

అర్కనామగణ మనువుగ రెండు, దార్కొని లఘువొందఁగ నిట్లుండు
దర్కించఁగను వితాళమునందుఁ, బేర్కొనఁ దగు హరిబిరుదులపిందు.

ఇందుల కర్థము విచార్యము; ఇట్టిది యప్పకవీయమున నొందున్నది, దానియర్థమును విచార్యమే.

భానుయుగముపై భయినవలని,పూన మణివిరతి నొంది ధరలో
జానలరుఁ జతుష్పదవి తాళా,ఖ్యానము నవి నాయకతురంగా.

అనంతునిలక్షణ మున్న తెఱఁగరయఁగాఁ బంచదశలఘువులు గల గణము లోకపాదమునఁ గలది యని తెలియవచ్చెడి. యతి యొనిమిది లఘువులపై నున్నది. అనంతునిపద్యమున నంత్యానుప్రాసము గలదు గాని మూఁడవపాదమున తకారమునకు మాఱు దకార మున్నది. దీనిచే దడ

లకుఁ బ్రాసమైత్రియుఁ గలదని తేలెడిని. దడలకు యతిప్రాసమైత్రి గలదని కొందఱు లాక్షణికులమతముగాఁ గోచరించెడిఁగాని యప్పకవి వాని నగ్రాహ్యప్రశస్తముల పట్టికకుఁ జేర్చినాడు. జ్ఞాకు నకారము తద్భవవ్యాజమునను, నభేదవ్యాజమున వబ, లళ, మున్నగువానికి యతి చెల్లునప్పుడు (1) డిండీరడంభడాడిమీడోలికాది శబ్దంబులకు సంస్కృతమందున, దాక దగ్గిర దిగ్గియ దాయాదాద్యాంధ్రశబ్దములకును డకారాదేశము శాబ్దికమతమున ఘటిల్లుచుండ,దడలకు నాదేశవ్యాజమున యతిప్రాసమైత్రి యేలచెల్లరాదు ?

ఇందులకుఁ గొన్ని ప్రయోగంబు లున్నను వాని కిటీవలఁ బాఠాంతరములు గల్పింపఁ బడియె.

ఒక్కయుదాహరణము.

మండితసూర్యరశ్మి రుచిమన్మణిహారచయంబులోఁ గట
స్యంది సుగంధి దానజలసంపద నొప్పెడివాని......(సభాపర్వము)

మందింత యనుపాఠ మచ్చునఁ గనఁబడుచున్నది.

(6) ద్విరదగతి రగడ-

హరి యొప్పు నన నొప్పు నవతారలఘువిరతి
శరధినగ, నలల, భల, సల, త,రలద్విరదగతి (56 ప)

అప్పకవీయము-

కరమొప్పఁ బంచలఘు గణచతుష్టయముచే
విరమంబు రెంటిపై ద్విరదగతిపేరిచే.

పంచలఘుగణము లెనిమిది- నలల,భల,సల,నగ,జల,త,ర,య. ఇందు జల,యగణము లుపయోగపడవు. ఈయంశ మీరెంటిని వీడుటచే ననంతుఁడు లక్షణము స్పష్టముగాఁ దెలియఁబఱచినాఁడు గాని యప్పకవి చెప్పలేదు.

(1) లళలకుఁ బ్రాసమైత్రి కలిమిచేఁ గాక డడలకును గొందఱమతమునఁ గలదు.

(7) రగడలభిన్నలక్షణములు.

(i) వృషభగమనము.

శ్రీమనోహరు సంబుజోదరుఁ జిత్తజాతగురుం దలంచెదఁ
గామితార్థవిధాయి నిర్జితకాళియాహిని నాశ్రయించెద
ననువుగా భగణములు భానుసమన్విత ద్వితయములు నాలుగు
నవిమిపాధిప లఘుయతి నిడఁగ నలరు వృషభగమనము మేలగు.

భసనలలు- పాఠాంతరము; చతుర్థపాద మనుసరించి యిదియే సమీచనము తొలుత నొకసూర్యగణము వెనుకగా భ-స-నల గణములలో నొండు, ఇట్లు నలుమాఱులు వ్రాసిన నొక చరణ మగును; యతి 14 లఘువులపై (4 గణములపై) నుండును.

(ii) హరిణగతి-

శ్రీనివాసు భ-జింతునే నని, పూని కుజనుల-పొంతఁబోవని
భానుయుత సల-భసగగంబుల, లోన నిరుదో-లు ననగంబుల
నిరవుగా నిరు-మాఱు లఘువుల, నెల్లవారును-నొగి గణింపఁగ
విరతులను గా-వింప నిమ్ముల, హరిణగతిచెలు-వగు జగమ్ముల.

పై వృషభగతి యీహరిణగతికి ద్విగుణమని భావింపవలయు. పై విధముగనే గణము లుండును, రెండుభాగములుగాఁ జేసి భిన్నయతులను పాటించుచు నారెండుసగముల మొదటఁబ్రాసముల నిర్మింపవలయు. తృతీయపాదమునఁ గొంతభంగము గానంబడుచున్నది 'ఇరవుగా నిరుమాఱులఘువుల' అనుచో యతిభంగమును, 'ఎల్లవారును- నొగి గణింపఁగ' ననుచోటఁ బ్రాసమును యతియు భంగమగును. అంతియ కాక మూఁడవపాదమున నంత్యానుప్రాసము తప్పిపోవుచున్నది. 'మరి యుఁ దానిరు-మాఱులఘువులు, నిరవుగా గణి-యింప నార్యులు' అని సవరింప సరిపడునేమో. రగడలంగూర్చి భీమనపెద్దనలు దలపెట్టలేదు; అనంతుఁడే వీనిని మొదలిడినవాఁడుగా నగపడుచున్నది; అవల నప్పకవి రచించెను, గాని యతనిమతము పూర్తిగా నిందు భిన్నమై యున్నది చూడుఁడు.

వృషభగతి-

ఇరువదియెనిమిది లఘువులు పది-యేనిట విశ్రాంతియుఁ గూర్చిన
నిరవు వృషగతి పద్మాధిప-యిది విను మాదరమున ముదమున.

హరిణగతి-

సరిహరి పదియు-నాలుగు లములు.
కరియతి హరిణ-గతికి నెళవులు.

(౫) యతిభంగములు.

(i) జయభద్రరగడ.

శ్రీకి నొడయుం డనఁగఁ - జిత్తజుని గురుఁడనఁగ
శేషశయనుండనఁగఁ - జెలువుగఁ జతుర్భుజుఁడు
నాకౌకసులనేలు - నముచిసూదనుపూజ
నతఁడు దాఁగైకొన్న - నందగోపాత్మజుఁడు.

ఇందు యతులు మూఁడుస్థలములం దుండవలయును, ప్రథమపాదమున నట్లేయున్నది; గ్రంథమునఁ దృతీయచతుర్థము లట్లే యున్నవి, గాని ద్వితీయపాదమున 'సూదనుపూజ నతఁడు' అను సంధివశమున నేర్పడిన నకారమును హల్లువలె భావించి యతిమైత్రి నొందించుట దోషమగును.

(ii) ఒగిఁ దరువాతి యిండ్లఁ బ్రతులొందఁ నధోంకముఁలఁ సమాధికం
బగు బ్రతిమానుచుం గడమ కాలప్రతుల్ దొరలించి నిల్పఁగాఁ.
ఇందును యతిభంగమున్నది.

చతుర్థాశ్వాసము.

వ్యాకరణవిశేషములు:—

కేతన పెద్దవాఁడు లాంధ్రమునకు వ్యాకరణముఁ వ్రాయుటం గని మనయనంతుఁడు చతుర్థాశ్వాసమునఁ గొంతవ్యాకృతిఁ రచించెను ఇంతేకాక తక్కుంగలయాశ్వాసములందును సందర్భపడినపుడు వ్యాకరణకార్యముల వివరించెను.

1 ఆ, 39 ప-ఆయుపేంద్రుని బొడఁగాంచు—అనుపద్యమునఁ ద్రికసంధి.

1 ఆ, 52 ప-పేర్చి పొల్లునకారంబు బిందువగుచు-అనుచోట వర్గయుక్కులు పరంబగునపుడు ద్రుతసంధి.

1 ఆ, 61 ప-62 ప-కళాద్రుతప్రకృతికసంధులు.

1 ఆ, 63 ప-జడంబు ద్వితీయకుఁ బ్రథమ యగుననుసూత్రమును,

1 ఆ, 64 ప-అకారసంధి, ఉకారసంధి.

1 ఆ, 65 ప-టుగాగమ నుగాగమ సంధులు.

1 ఆ, 66 ప-పదమధ్యములందలినుఱులు రువర్ణములస్వరలోపము.

1 ఆ, 85 ప-ఐ, ఔలకు అయి అవు లగుట.

1 ఆ, 114 ప-జ్ఞాకుఁ దద్భవమున నకార మగుట.

1 ఆ, 115 ప-ఆంధ్రలిపి ఋకారసంయుతము లేమి.

ఇట్లు వ్యాకరణాంశములు తెలుపఁబడినవి. ఇప్పటిసులభవ్యాకరణాదు లాంధ్రుల కుపయోగించుటంజేసి సంస్కృతసంధి సమాసప్రకరణములతోఁ జేర్పబడినట్లు ఛందోదర్పణంబందుఁ దత్పూర్వగ్రంథంబులందు లేనిసంస్కృతసంధిసమాసాదులు పద్యరూపములుగా రచియింపఁబడ్డవి. ఇదియే తక్కినవానికన్న నిందున్నవిశిష్టత. ప్రకృత మనంతుని వ్యాకరణ ప్రయోగములంగూర్చి కొంత చింతింతము. ఇంతకుమున్నె ప్రథమమైన, త్రికారంబునకు మున్నగునవి చర్చింపబడియె ఇందుఁ జతుర్థాశ్వాసమందలివిషయముమాత్రమే కైకొనంబడును.

19 ప-దీనోడయుఁడు, ఇదెట్లోదవె కుసంధులఁట.

ఇందు మొదటిది వానిల్లు, దానిల్లు ఇత్యాదిం బోలినదిగానఁ బ్రయోగింపవచ్చు; ఇది+ఎట్లోదవె "ప్రాయస్తుస్యాత్కిమాదికస్యేశః" అని చింతామణి, ఇది కిమాదులలోఁ జేరినదగుటచే సంధి వైకల్పికము గాన నిత్యరూపము నిర్దోష మగును. ఇవి కుసంధులు గావని ఫలితార్థము. 20 ప-అతఁడున్నతేఁడు-దుస్సంధి.

ఆతని ధైర్యశక్తి కిన్నరుగాగ (భారతము) సురగణంబు క్షోభము నొందె న్నిర్విధమున (౬-హరివంశము) మున్నగు ప్రయోగము లున్నవి. ఇది చూచియే కాబోలు ననంతుడు 'ఇట్టివి వళదోషము లనఁ బట్టగుఁ గృతులందు నివియ భాసురముగఁ జేపట్టుదురు ధీరు లొక్కొకపట్టన డెందమ్ము లలరఁ బల్కినఁ గృష్ణా' యని చెప్పి తప్పించుకొన్నాఁడు.

38 ప-షట్సంధులను జెప్పుచు, 'ప్రకృతిసంధి యన్నది యాంధ్రభాషఁ జొరదు' అన్నాఁడుగాని బ్రహ్మఋషి, మహాఋషి, సప్తఋషులను ప్రకృతిభావసంధివిశిష్టము లగురూపము లాంధ్రభాషయందును గలవు.

51 ప-ఆడఁజొందె ఘనోత్తుపత్సాతు వనఁగ.

నాఁగ బింబోష్ఠి నొక్కబింబోష్ఠి యనఁగ

వృద్ధియతిని యతిప్రకరణమునఁ జెప్పకున్నను నిందుఁ గూర్చి యున్నాఁడు. ఇట్లే కాకుస్వరయతికి నుదాహరణపద్యమున*శషయతి, విశాలచౌపదలో దడప్రాస, ముంగు యతిప్రాసప్రకరణములందుఁ జెప్పకున్నను ననంతుడు రచించినాఁడని చూడఁబడియె.

62 ప-షడ్డలంబులు నాఁగ నకలజగద్ధితప్రౌఢిమ నాఁగ నుబ్బస్తులనఁగ—

ప్రౌఢి శబ్దము క్తిన్నంతమే కాని ఇమనిజంతము కాదని సంస్కృత వైయాకరణులయభిప్రాయము. ఆంధ్రమున శ్రీనాథాదిమహాకవిసార్వభౌము లనేకులు బాహాటముగా 'ప్రౌఢిమ'ను బ్రయోగించియున్నారు.

90 ప-అనుగ్రహ నిగ్రహములు.

అల్పాచ్తర మిత్యాదిపాణినిసూత్రనియతి తెనుఁగునకు లే దని శాసించినాఁ డనంతుఁడు, పూర్వకవుల ప్రయోగములం బట్టి యిది న్యాయ్యమని తేలుచున్నది.

102 ప-ఓలిఁ బురుషసింహలో యని యుగ్గడించు-చోటఁ దాసింహ ఇనపురు షోయనంగ.

---

* ఎక్కటియతి యందుఁ బాఠాంతరము కల్పింపఁబడినను మూలములో నుంటచే నిందు గ్రహింపఁబడియె.

లోపోనమ ఆదికేవిసర్గస్య అని చింతామణి చెప్పుచున్నను, నమశ్శబ్ద విసర్గస్య లోపమోత్వ మపీష్యతే - యను కారికగలదు. గతానుగతికోలో కోయటంచిత్యాది ప్రయోగములు కారికననుసరించి యేర్పడినవి. అట్టివే పై సింహాలోయని, పురుషోయనంగ, ననుప్రయోగములు.

108 ప- సంస్కృతము తెనుఁగైనఁ దత్సమపదంబు,
దానఁబుట్టి తెనుంగైనఁ దద్భవంబు,
దేశి తెనుఁగు దేశజ, మచ్చ తెనుఁగు తెనుఁగు,
నిర్మలుఁడు, సిరి, యొడయఁడు, నిక్కమనఁగ.

పై పద్యమాంధ్రభాష - తత్సమము, తద్భవము, దేశి తెనుఁగు, అచ్చ తెనుఁగని చతుర్విధమని తెల్పుచున్నది. కాని 'తజ్జానమాచదేశ్యా గ్రామ్యాచేయం చతుర్విధా భవతి'యని చింతామణి సూత్రము. గ్రామ్యము భాషలో నొకవిధము కాఁజాలదను కొందఱమతమునకుఁ జేరిన దీయనంతుని పద్యము. దేశ్యమాంధ్రదేశ్యము, అన్యదేశ్యమని యిరుదెఱంగులను నిప్పటి యభిప్రాయము న నంతుఁడు పూర్వమే యాంధ్రదేశ్య మచ్చతెనుఁగు, నన్యదేశ్యము దేశితెనుఁగను విభాగమునఁ జెప్పినాఁడు. కేతనపెద్దనలు తత్సమము, తద్భవము, దేశి తెనుఁగు, అచ్చ తెనుఁగు, గ్రామ్యమని పంచవిధములనిరి. వీరిమతమును గైకొని మన యనంతామాత్యుఁడు గ్రామ్యమును మాత్రము వదలియున్నాఁడు.

109 ప- పంచమియగు దీఁబట్టుండి యాగుండి ... ... ... వానియొక్క
కులంబు.

ఇందు దీనఁబట్టి + ఉండి- ఇత్వసంధి ప్రుతికటువు;

వానియొక్కకులంబు- విభక్తుల కుదాహరణముగా నీయఁబడినది ఈవిభక్తి ప్రత్యయము జేర్చివ్రాసిన ప్రయోగము గ్రంథంబుల మృగ్యము. యొక్కలోపించి సమాసమగును.

111 క- పరుఁబలుకుఁ బ్రథమపురుష మె
దిరి మధ్యమపురుషపలుకు ధృతి దనుఁ బలుకున్
ధరను త్తమపురుషక్రియ
వరుస నలింగకములైన వచనము తెనుఁగున్.

పురుషత్రయమునకు లింగవివేకము లేనివచనము లుండునని యర్థము. ఉత్తమమధ్యమములకు మూఁడులింగములందును భేదము లేదుగాని ప్రథమపురుషమున- ఏకవచన పుం- వాఁడు చేయుచున్నాఁడు, స్త్రీ- ఆమె- అది చేయుచున్నది, నపుం- అది చేయుచున్నది, అను భేదము లున్నవి గానఁ బైయనంతునివాక్య మవిచారమూలకమే యగును.

116 క- పృథయను నవ్యయ మొక్కఁడు
ప్రథితంబై చెల్లుఁగృతులఁ బ్రత్యేకముతా
పృథ సేయక నొప్పుచు మనో
రథములు మాకిచ్చు నీ మురద్విషుఁ డనఁగన్.

సంస్కృతావ్యయములలో పృథమాత్రమే తెనుఁగునందుఁ బ్రత్యేకముగాఁ బ్రయోగింపవచ్చునని పై పద్యమునకు భావము.

పలుకులు పృథగా నన్నం బలికిరి (శాంతి. ౧ ఆ. 136) అను భారతప్రయోగము పై పృథయను నవ్యయమునకు నాధారముగాఁ గలదు.

పృథయను నొక్కదానికే కాక యనేకసంస్కృతావ్యయములకుఁ బూర్వకవిగ్రంథంబులందుఁ బ్రయోగంబులు గానవచ్చెడు.

జాదరియన్నంబు సూనరియన్నంబు బహిః వెట్టినతని యున్న మును (భార- శాం- 1 ఆ.)

బంధువు లెటేఁగిన బహియోఃర్తురు (భాగ- దశ. పూర్వ. 978.)

మామా నాపైఁ గోపము వామా. (భాగ. నవ. 547.)

స్వస్తిజగత్త్రయాభువనశాసనకర్తకు (భాగ- అష్ట- 545)

సద్యంబ బ్రాహ్మహత్యాపద్యము మొదలైన పాపవర్గం బెల్లన్ (భార- స్వర్గ- ౧ ఆ.)

ఒక దివసంబు నానందకాననమునందు సర్వదా సిద్ధించుఁ
(కాశీ- ౭ ఆ.)

ధాత్రీశుల కర్జున సర్వత్ర జయము (జైమిని- ౭ ఆ.)

ఎవ్వారు నీ ప్రతి లేరీ భువనత్రయంబున (హరి- ఉత్తర- ౧౦ ఆ.)

కించిత్తు నల్లి గఱచిన (సుమతిశతకము)

ఇట్లు, సదా, సర్వధా, నహి, నాస్తి, అహహా మున్నగు నవ్యయములకు స్వతంత్రప్రయోగములు గలవు. అనంతుని వెనుకటికవులు అథవా వినా ప్రభృతులను బ్రయోగించినారు. తనకుమున్నే వృథేతరావ్యయశబ్దములకుఁ గవిప్రయోగము లుండ ననంతుఁ డొకవృథకు మాత్రము పూరించుట యతని పరిశీలనలోప మున్నదని తోఁచెను.

పంచాశద్వర్ణంబులు:—

121 ప. భూమిఁ బదాఱచ్చులు నాఁగా మెఱసి అకార మాదిగా స్వరములగుఁ
కామొదలు క్షకారము తుదయై ముప్పదినాల్గు హల్లులగు వ్యంజనముల్.

125 ప. శలలకు భేదము లేదను పలుకున ళాఁదొలఁగినయెడ నేఁబదులగువర్ణంబులు సంస్కృతభాషకు మఱి తెలుఁగున అళలసఁగ రెండధిక మంత్రము హరీ.

శబ్దచింతామణి- ఆద్యాయాః పంచాశద్వర్ణాః.

ఇందులకు వరరుచివచనము:—

ద్విధాక ఏచో నుస్వారో విసర్గ షోడశస్వరాః
స్పర్శా అంతస్థళోష్మాణ శ్చతుస్త్రింశ ద్ధలస్స్మృతాః.

చింతామణి వరరుచివచనములు క్షకారమును విడిచి ళకారమును వర్ణసముదాయమునఁ జెప్పుచున్నవి గాని పాణిని మహేశ్వరసూత్రములందు ళా లేదు. ఈ యనంతుని పద్యములను ఖండించి యప్పకవి ళకారమును బ్రత్యేకవర్ణముగా నిర్ధరించెను. 'ఏకనీళము దేవహేళనంబు నటం

ము యాజుషామ్నాయంబు నందు లేదా, కాళనాళవ్యాళగోళహింతా ళంబులనుచు సంస్కృతభాషయందు లేదా, యని రచించి,

'కాకు షా జడ్డమైన ళ కారమగుట
దలఁప కేఁబది లిపులలో దానిఁగూర్చి
తొలుత భిన్నాక్షరంబైన దొడ్డళాను
విడిచిపెట్టె ననంతుండు వెఱ్ఱి గాఁడె.

యని పరిహాసించియున్నాఁడు:—

యత్ర విశ్వంభవత్యేకనీళం (యజురారణ్యక నారాయణప్రశ్నము)
యద్దేవా దేవహేళనం (యజురారణ్యక నారాయణప్రశ్నము)

ఇందు ళకారమున్నది గాని కాళనాళవ్యాళగోళహింతాళములు లాంతములుగానే పరిగణింపవచ్చు. సరిగదా, ళకారమును నిషేధించిన యనంతుఁడు మఱల,

128 క- అనులు వర్గత్రయమును
భూదేవతలు, తపవర్గములు రవలును ధా
త్రీదయితులు, యల శషసహ
లాదట నూరుజులు, ళక్షరాఖ్యలు శూద్రుల్.

అనుపద్యమున ళకారమెట్లు గ్రహించినాఁడో తెలియదు. 'తెలుఁగున అళ లనఁగ రెండధికముండ్రు హరీ' యనియోఁ గానఁ దెనుఁగునందని భావించినచో ఆయేల చెప్పలేదనుప్రశ్న సంభవించును.

ఛందోదర్పణమునందలి కొన్నిపద్యములకర్థము సుబోధముగా లేదు. వ్యాస విస్తరభీతిని వాని నిందుఁ దలపెట్టలేదు.

అనంతుఁడు తత్పూర్వకవులకంటె విపులముగా ఛందంబును, వారు చెప్పని యాంధ్రోపయుక్తంబగు సంస్కృతవ్యాకరణంబును రచియించి యుత్తరకవులకు మార్గదర్శకుండయి యాచంద్రతారార్క స్థాయియగు కీర్తిఁ ప్రశంసితవ్యక్తుండుగా వర్తించుచున్నాఁడు. ఇవ్విమర్శనమందు యతిప్రాసవ్యవస్థ, పిఠాద్యాగిత్యక్షరాది విషయంబులను శ్రీగిడుగు వేంకటసీతాపతిగారు విస్తారంబు విమర్శించి యుంటంజేసి వానిని

విడనాడి నాకుఁ బాడఁగట్టిన కొన్ని విషయములను మేళగించి రచించి నాఁడను.

ముద్రణస్ఖాలిత్యములు:—

వావిళ్లవారి ప్రతియందనేక స్ఖలనములేర్పడియుండుటచేత మఱల దానిం జాలమట్టునకుఁ బరిశీలించి తప్పొప్పులపట్టిక నొండు ననుబంధముగాఁ జేర్చితి. మఱి యట్లున్నను ననివార్యములుగాఁ గొన్ని యింకను గలవు.

1 ఆ. 27 క- అధికశుభం, బాదవును భయనులను హానిఁబొందు నృసింహా- ఇందు హానినొందునని మార్చిన యతిభంగము తొలంగును.

1 ఆ 63 క- 'ఆయుచేత నద్వితీయ దానిజరూకమయ్యెనుంగుఁ బ్రథమ యట్టులుంచుఁ, గ్రతువుఁగాచె దాశరథి కృష్ణుఁడోకపర్వతమును గొడుగుభంగిఁ దాల్చెననగ? జడంబు ద్వితీయకుఁ బ్రథమ విభాషనగు ననుటదీనియర్థము. పర్వతమును ద్వితీయకును, క్రతువు ప్రథమకు నుదాహరణములగుటచేఁ గ్రతువుపై సర్ధబిందువుంట దోషము.

2 ఆ 48 క- పెంపారఁ దాజంబులఁ జేర్చు రేఫలో-యతిభంగము; పేర్చు అని సవరించుకోవలయు.

3 ఆ 43 వ- కనకవస్త్రుని గృత్తకైటభునిగొలుతు ఇదియాంధ్రరాక్ష్యర- 1 సూ, 2 ఇం, 1 చం; కైటభునిగొల్తు అనియుండవలయు.

3 ఆ 57 క- రగడ- ఇతనిఁగొల్చినఁగాని......ఎనఁగు నివ్విభుఁడనుచు జతురమతు............... బొటింపులం బెంచు అంతాను ప్రాస విధిచేఁ బైపాఠము కడపట 'అంచు' అని యుండనగు.

4 ఆ 48 ప- 'ఇత్వ ముత్వ మోత్వ మైత్వ మాత్వంబైదు
నాదిమైన ఋకారము కరమైన చోట'

మొదటిపాద మాటవెలఁదివలె నున్నదిగాన భ్రమించి యట్లే ముద్రిం

చినట్లు గాఁ జెడెఁగాని రెండవపాదము తేటగీతియని స్పష్టముగాఁ దెలుపుచున్నది. ప్రథమపాదము గణభంగమగుటంబట్టి తేటగీతి యగుటకు 'ఇత్వముత్వ మోత్వంబైత్వ మాత్వమైయు' అని మార్పవలయు.

4 ఆ 76 ప- తే. గీ. వామపదవి సర్గాంతవర్ణమోత్వ
మగు రజోగుణమున మనోహరమనంగ.

4 ఆ 81 ప- క కవియుఁబునర్ ఋతుసమేత కమలాక్షియనఁ-పునరృతు అనుశబ్దమున 'న' గురువుగా నేరదు గాన గణభంగము తటస్థించు. 'కవియును బునరృతుసమేత' అని సవరింపవలె.

యతిప్రకరణమున 24 యతులపేర్లు నాయాపద్యములకు ముందు ముద్రితములుగా లేక యందు 15 మాత్రమేయున్నవి. ఇంతియకాక మఱి కొన్ని యతిగణప్రాసభంగములు ముందే పేర్కొనఁబడినవి. వీనినన్నిటిని బునర్ముద్రణమున సంస్కరించి సందియంబులు దొలఁగును. వీనినిందు గూర్చుటకు నిదానమనంతామాత్యునిపై నారోపింపకుండవలయు ననుటకేయని తెలుపుచున్నాఁడను.

# "అఱవనామెత"

[అర్థవిచారణము.]

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.

కూకటివేణితోఁ గురులు గూడకమున్న కుచప్రరోహముల్
పోఁకలతోడిసామ్యమును బొందకమున్న నితంబసీమకున్
బ్రేఁకదనం బొకింత ప్రభవింపకమున్న ప్రసూనబాణుఁ డ
ట్టాఁకలఁ బెట్టెఁ దా నఱవనామెతబాలికకై విటావళిన్.

ఈకళాపూర్ణోదయపద్యమునందలి "అఱవనామెత" పదమునకుఁ బండితులు పలువిధము లగునర్థములు తలకొకరీతిఁ జెప్పిరి. అవి కొన్ని వివరింపఁబడుచున్నవి.

(౧) అరవన్ = ఎడారిలో, ఆమెత = విందువంటిదగు బాలికకై ప్రసూనబాణుఁడు తాను విటావళిని అట్టాఁకలఁ బెట్టెను = నిర్బంధించెను. కలభాషిణి యెడారియందలివిందువలెఁ దృప్తికరముగ నున్నదని భావము. (అరవ శబ్దమున కెడారి యనునర్థ మగపడదు).

(౨) అఱవని — అఱగని, జీర్ణముగాని ఆమెత = విందువంటిది. కలభాషిణి సంపూర్ణమైన విందువంటి దనుట.

(౩) ప్రసూనబాణుఁడు తాన్ అఱవన్ = అఱచునట్లుగా (విటవిజయముచే) ఆమెతబాలికకై = విందైనపిల్లకై (భోగపుఁగన్నె యగుటచే విందువంటిది) విటావళి నట్టాఁకలఁ బెట్టెను.

(౪) ప్రసూనబాణుఁడు తాను విటావళిని ఆమెతన్ = అనుభవమందని బాలికకై అఱవన్ = ఆటంకపఱుచుటకు కేకలు వేయుచుండఁగా అట్టాఁకలఁ బెట్టె = మిక్కిలి ఆఁకలియందుఁ బడవైచెను. (విందు ముందఱఁ బెట్టి విటులను మన్మథుఁ దూరించుచుండె ననుట)

(౫) అరవన్ = రాజవీథిలో ఆమెతబాలికకై = వడ్డించని విందైన యా కలభాషిణికొఱకై, సిద్ధమైనవిందనియుఁ జెప్పుదురు.

(౬) అఱుమనియామెత బాలిక = మన్మథుఁడు పూర్తిగా నలమకొనని వీఁడైన బాలిక (అజ్జాఁక. అజ్జు + ఆఁక = మెడనొక్కు యాఁపుట).

(౭) అఱుము = అమ్ము. అఱవనియామెత బాలిక = అమ్మకమునకు సిద్ధము చేయని విందువంటి బాలిక.

(౮) "అజ్జాఁకలఁ బెట్టి తా నఱవ నావెల బాలికకై విటావళిన్" ఆవెల బాలికకై = ఆభోగపుఁబిల్లకై (తక్కినది సమము).

ఇటు పెక్కువికల్పములు సూచించి యీచిట్టచివరపాఠము బాగుగ నుండునని కీ॥ శే॥ ఓలేటి వేంకటరామశాస్త్రులవారు (ఆంధ్రి 3 సం. ౨ సంచి) ఒకవ్యాసము వ్రాసిరి. అప్పటి కది యందముగ నున్నదనియే యనుకొంటిని, వారి కాధారముగ చెన్నపుర ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోని కొన్ని తాటాకుఁబ్రతులలో 'ఆమెత' కడ ఆమెళ- ఆవెల యనుపాఠములు కనఁబడినవఁట- కాని పెక్కుప్రతులలో 'ఆమెత' యే యున్నది.

ఈపాఠములు నియర్థములు పరిశీలించితతో 'నఱవ' యను నలఘురేఫయుక్తపాఠమును, 'ఆమెతబాలిక' యను పాఠమును బహువండితాంగీకృతములగుటయే గాక, బహుముద్రితాముద్రితగ్రంథస్థములైనవని తేలినది. లఘురేఫముతో 'నరవ' యనుటయు, 'అఱుము' అనుటయు నర్థానుగుణములు కావు. అనుపూర్వతముగ వచ్చు 'అఱవనామెత బాలిక' కందమైనయర్థము చెప్పనొప్పఁగాని పాఠము మార్చి యేదో యర్థముచెప్పుట పసి గాదు.

అది యటుండ, శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువున "అజ్జాఁక" పదమునకు ఒత్తుడు,బాధ అనునర్థము వ్రాయుచు నీపద్య ముదాహరించిరి. అచటిపాఠ మిటు లున్నది.

"అజ్జాఁకలఁ బెట్టఁ దా నరవ నామెతబాలికకై విటావళిన్"

ఇందలి 'యరవ'పదము లఘురేఫయుతము. నిఘంటుకారులు అరవశబ్దమునకు ద్రావిడుఁ డని మాత్ర మర్థ మున్నటులు వ్రాసిరి. అది

ప్రకృతిమున సరిపడమగదా? మఱి యచట నర్థ మిట్లో రూపొందింపవలసి యున్నది. (౧) లో( జెప్పినట్లు అగవశబ్దమునకు ఎడారి యనునర్థము చెప్పుకొందమనిన, నది యీయర్థమున నప్రయుక్తము సరికదా, అభిధానికముకూడ( గాదు. (౨) లో వ్రాసినట్లు రాజవీథి యనుటకు( బై సమాధానమే చెప్పవలసివచ్చును. కాన నిట శకటరేఫపాఠమే గ్రాహ్యము.

ఇది యెల్ల( జూడ నా కిట్లు తో(చినది. 'అఱచు' ధాతువునకు కేకవేయు, పిలుచు ననునర్థము ప్రవాతముగ నున్నది. ప్రయోగములు కూడ( బెక్కులు. అఱవని + ఆమెత=పిలువని విందు. ఇట్టి సంధులు చేయుట పెక్కుచోటుల( గలదు. కలభాషిణి పిలువనివిందువంటి దని పిండితార్థము. ఒకరింట విందు చేయుచు( బిలువకున్నచో మన మారాట పడుట (ఉవ్విళులూరుట) సహజము. కలభాషిణి పిలువనివిందువలె విటులచిత్తములను అఱ్ఱాకల( బెట్టినది, అన(గా బాధల( బెట్టినది. (౪) లో సూచించునటులు అఱ్ఱాకట( బెట్టె ననిన మఱియు సరసముగ నుండి ప్రకృతార్థమును సార్థకము చేయును. పిలువనివింకు అఱ్ఱాకటఁ=మిక్కిలి ఆ(కలియందు( బెట్టు ననుట నిజము. ఈపాఠము లేదం మరేమో? ల, ట లకు( బెద్దవ్యత్యాసము లేకుండుటచే( దాళపత్ర ప్రతులు సరిగ( జూచిన సంశయ విచ్ఛిత్తియగును. 'ఆమెత' యనుపాఠ మంగీకరించినపక్షమున నఱ్ఱాకట( బెట్టె ననుటయే యనుగుణము.

బహుసమ్మతమగుపాఠము విడిచి యొకటిరెండు ప్రతులలో నున్న దని "ఆవెలఁబాలిక" యనుపాఠము స్వీకరించుట మంచి దని నాకు( దో(పదు. అట్లర్థము చెప్పిన నీపద్యమునకు(గలబింకము చెడు ననిపించు చున్నది. అయినను, వాదిసిద్ధాంత మనను. యదార్థముసూత్రము వెల్లడికావలయును.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్తు.

# స్వభానునామ సంవత్సర కార్యనివేదిక.

## 1943—44.

ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు
పిఠాపురంమహారాజావారు, పరిషద్యావజ్జీవాధ్యక్షులు.

శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు – ఉయ్యూరు జమీందారువారు.

అధ్యక్షులు.

సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

కార్యదర్శులు.

కిడాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ. బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు, ఎం. ఏ.

కార్యనిర్వాహకసభాసభ్యులు.

శ్రీదివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారు (కోశాధ్యక్షులు.)

,, పిల్లారిశెట్టి రంగబ్రహ్మారావునాయుడుగారు.

,, కోటా శివనాథశాస్త్రిగారు.

,, కొమ్మిరెడ్డి కేశవరామమూర్తినాయుడుగారు.

,, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

,, నిడుదవోలు వేంకటరావుగారు, ఎం. ఏ.

,, ప్రతివాదిభయంకరం పార్థసారధిగారు, బి. ఏ., ఎల్. ఎల్. బి.

,, కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.

,, కేశవరపు కామరాజుగారు

,, వేమూల శ్రీరామచంద్రకీర్తిగారు, ఎమ్. ఏ.

,, ఏలేశ్వరపు వెంకటరమణసుబ్బారావుగారు, బి. ఏ., బి. ఎల్.

, అడ్డాల రామమూర్తిగారు, బి ఎ. బి. ఎల్.

స్వభానుసంవత్సరముతోఁ బరిషత్తునకు ముప్పదిరెండవసంవత్సరము ముగిసినది. యుద్ధపరిస్థితులు తీవ్రముగనుండి పరిషత్కార్యములకు వలయు కాగితము సరిగ లభింపకపోయినను, పత్రికాముద్రణము యథాప్రకారము జరుగుచున్నది. నూతనగ్రంథముల ముద్రించుటకు మాత్రము వీలుకలుగుట లేదు.

పరిషద్భాండాగారము దినదినాభివృద్ధి నొందుచున్నది. నూతనగ్రంథములు చేర్పఁబడుచున్నవి. వినిమయముగఁ బత్రికలఁబంపుపత్రికాధిపతులకును, గ్రంథముల నుచితముగ నొసఁగినవారికిని మన కృతజ్ఞతాభివందనములు. కాశీఖండపు తాళపత్రప్రతులఁ బరిశోధించి యందలి పాఠభేదములు వ్రాయింపఁబడుచున్నవి. త్వరలో వానిని బత్రికాముఖమునఁ బ్రచురించి పాఠకలోకమున కందజేయఁగలమని యాశించుచున్నాము. ముద్రితాముద్రితగ్రంథముల పట్టికలను వ్రాయించి, కాగితము లభించిన వెంటనే వానిని ముద్రింపవలసియున్నది. కాశీఖండము పాఠభేదములు పూర్తియయిన తరువాత నాంధ్రమహాభారతము ప్రతుల పరిశోధించి పాఠభేదములఁ బ్రకటించుచున్నాము.

శ్రీ శ్రీ పీఠికాపురప్రభువుల యాదరమువలనను గార్యదీక్షవలనను సూర్యరాయాంధ్రనిఘంటువు నాల్గవసంపుటము ముద్రణము పూర్తియైనది. మిగిలిన సంపుటములవలెనే నాలుగవసంపుటముగూడ ప్రతియొక్కంటికి నాలుగురూప్యములకు విక్రయింపఁబడును. వెనుకటివలె నచ్చుపనిజరుగుటకు సౌకర్యము లేమి నిఘంటుకార్యస్థానమున 'ప' వర్గశబ్దములు పండితులు పరిశోధించి ముద్రణమునకు సిద్ధము చేయుచున్నారు. అచిరకాలముననే అయిదవసంపుటము ముద్రణము ప్రారంభింపఁబడును.

స్వభానుసంవత్సర ఆయవ్యయపట్టిక సరిచూడఁబడి యనుబంధమునఁ జేర్పఁబడినది. శ్రీ శ్రీ బొబ్బిలి, వేంకటగిరిమహారాజావారలిచ్చిన విరాళములవడ్డీవలనను, పుస్తకవిక్రయమువలనను లభించిన ద్రవ్యముతోడను, పరిషత్కార్యముల యథావిధిగ నిర్వహింపఁగలుగుచున్నాము.

శ్రీ శ్రీ బొబ్బిలిమహారాజావారి పత్రములవలన నీసంవత్సరము రు 400- లును వేంకటగిరివారి పత్రములవలన రు 350- లును వచ్చినవి. నిఘంటుసంపుటములయొక్క విక్రయమువలనను పరిషద్గ్రంథ విక్రయము వలనను రు 691-7-0 లు వచ్చినవి.

నూతనభవనమునఁ పరిషత్కార్యాలయమునఁ జేర్చినతరువాత నితోఽధికముగ కార్యనిర్వహణ మొనర్చుటకు ప్రయత్నములు జరుపఁబడునని నివేదించుచున్నాము.

పరిషత్కార్యనిర్వహణమును గూర్చియు, పరిషదుద్దేశములను గూర్చియు నాంధ్రదేశమునఁ బ్రచారము గావించి వలయుధనమును సంపాదింపవలసియున్నది. అందులకుఁ దగినసహాయమును గార్యనిర్వాహకసభ్యులును, పరిషత్సభ్యులును జేయుదు రని యాసించుచున్నాము. పరిషత్కార్యముల సహాయమునొసంగి తమ యభిమానమును నిరంతరముఁ జూపుచున్న కార్యనిర్వాహకసభ్యులకు మావందనములు.

మాకోరికపై శ్రమయనక వాయవ్యయములఁ బరిశీలించి యీ సంవత్సరము లెక్కలను సరిచూచిన శ్రీ పల్లె వెంకటహనుమంతరావు గారికి మావందనములు.

ఇట్లు విధేయులు,

కిళాంబి రాఘవాచార్యులు,

వింజమూరి వెంకన్న,

కార్యదర్శులు.

# ఆంధ్ర సాహిత్య
# స్వభాను నామ సంవత్సర
# ఆదాయవ్యయముల

| సం. | ఆదాయము. | | | రు. | అ. | పై |
|---|---|---|---|---|---|---|
| 1. | సంవత్సర ప్రారంభనిలవ | | ... | 78 | 7 | 2 |
| 2. | వడ్డీ - బ్యాంకుద్వారా శీనూళ్లు | | ... | 750 | 1 | 0 |
| | శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజా వారిచ్చిన గవర్నమెంటుపత్రముల వడ్డీ 1943-44 | రు 400-0-0 | | | | |
| | వేంకటగిరి ,, | 350-0-0 | | | | |
| | బ్యాంకివడ్డీ | 0-1-0 | | | | |
| | | 750-1-0 | | | | |
| 3. | సాధారణసభ్యుల చందాలు | | ... | 18 | 0 | 0 |
| 4. | చందాలు | | ... | 81 | 0 | 0 |
| 5. | విక్రయములు | | ... | 691 | 7 | 0 |
| | i. పరిషత్పత్రికల విడిసంచికలు | 3- 8-0 | | | | |
| | ii. పుస్తకములు( షెడ్యూలు దాఖలా) | 687-15-0 | | | | |
| 6. | చిల్లర జమలు | | ... | 0 | 2 | 6 |
| 7. | శ్రీ కొత్తపల్లి సుబ్రహ్మణ్యముగారు | | ... | 4 | 1 | 9 |

1623—3—5

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి,
అధ్యక్షులు.

కిళాంబి రాఘవాచార్యులు,
వింజమూరి వెంకన్న,
కార్యదర్శులు.

# పరిషత్తు — కాకినాడ.

## (6–4–43 మొదలు 24–3–44 వఱకు.)

## తబిశీలు లెఖ్ఖ.

| నెం. | వ్యయము. | | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|
| 1. | బ్యాంకి చిల్లరవ్యయములు | ... | 1 | 0 | 0 |
| 2. | క్యాటలాగు వ్రాసినపండితునకు | ... | 20 | 0 | 0 |
| 3. | కొత్తపల్లి సుబ్రహ్మణ్యంగారు– (శ్రీ శే॥ కొ. సూ. జీతంబాపతు) | | 20 | 4 | 0 |
| 4. | పోస్టేజి | ... | 36 | 2 | 6 |
| 5. | ప్రయాణవ్యయము | ... | 10 | 4 | 0 |
| 6. | జీతములు | ... | 701 | 15 | 6 |
| 7. | పత్రికకు కాగితము | ... | 63 | 6 | 0 |
| 8. | ప్రింటింగు | ... | 110 | 0 | 0 |
| | బైండింగు : | ... | 195 | 8 | 0 |
| | i. లైబ్రరీ పుస్తకములు 13–4–0 | | | | |
| | ii. లెక్సికన్ 182–4–0 | | | | |
| 9. | పత్రికలకు చందాలు | ... | 48 | 10 | 0 |
| 10. | పుస్తకములు – ఖరీదుచేసినవి | ... | 103 | 5 | 0 |
| 11. | సాదరు | ... | 20 | 10 | 3 |
| 12. | నగదు నిలవ | ... | 292 | 2 | 2 |
| | బ్యాంకిలో 9– 6–7 | | | | |
| | కార్యదర్శివద్ద 282–11–7 | | | | |

1623—3—5

6-4-43 మొదలు 24-3-44 ఆఖరుఅయ్యే స్వభానునామసంవత్సరపు ఆంధ్ర సాహిత్యపరిషత్తు యొక్క బుక్కులనుబట్టిన్ని, లెక్కలనుబట్టిన్ని, యీ పైని ఆదాయ వ్యయముల తబిశీలులెఖ్ఖ నేను తణిఖీచేసినాను. కావలసిన యావత్తు సంజాయిషీ పుచ్చుకున్నాను. ఈపై ఆదాయవ్యయములెఖ్ఖ నిజమైనదిన్ని, సరియైనదిన్ని, స్థితిని కనపరచుచున్నదని నేను యిందుమూలముగా తెలియచేయుచున్నాను.

కాకినాడ }
2–6–1944. }

పల్లె వెంకటహనుమంతరావు,
2-6-44.
గవర్నమెంటు డిప్లమాహోల్డరు ఇన్ కామర్సు
ఇన్‌కమ్‌టాక్సు ప్రాక్టీషనరు అండు ఆడిటరు.

# పుస్తకవిక్రయము

| | రు.అ.పై |
|---|---|
| విప్రనారాయణచరిత్రము | 2- 5-9 |
| జైమినిభారతము | 33- 3-0 |
| కవిజనాశ్రయము | 14- 8-3 |
| యుద్ధమల్లుని బెజవాడశిలాశాసనం | 1-12-3 |
| జ్యోతిశ్శాస్త్రసారము | 1- 5-6 |
| జ్ఞానప్రసూనాంబికాశతకము | 0- 1-9 |
| సర్వేశ్వరశతకము | 0- 8-9 |
| కావ్యాలంకారచూడామణి | 2-15-6 |
| అకారాద్యముద్రితగ్రంథసూచిక | 0-14-6 |
| ప్రాకృతభాషోత్పత్తి | 3-15-3 |
| శివతత్త్వసారము | 2-13-9 |
| చంద్రభానుచరిత్రము | 3- 2-6 |
| శివరాత్రిమాహాత్మ్యము | 13- 3-0 |
| ఆర్యభాషావిభాగము | 3- 1-3 |
| ప్రాస్వరంగములు | 0-15-3 |
| నారసింహపురాణము | 1-12-3 |
| మన్నారుదాసవిలాసనాటకము | 1- 3-3 |
| కాళిందీకన్యాపరిణయము 1 భా | 4- 6-6 |
| డిటో 2 భా | 2- 3-0 |
| రెడ్లనాటి రెండుశాసనములు | 0- 7-3 |
| ఆంధ్రధాతుమాల | 2-10-3 |
| శాసనపద్యమంజరి 1 భా | 0-10-6 |
| డిటో 2 భా | 0-14-3 |
| శతకసముచ్చయము 1 భా | 5- 1-3 |
| డిటో 2 భా | 4- 3-9 |
| పరిషత్పుస్తకభాండాగారము 2 భా | 1- 3-3 |
| సూత్రాంధ్రవ్యాకరణము | 3- 0-6 |
| రసాభరణము | 2-12-3 |
| ఆంధ్రశబ్దచింతామణి | 4- 4-6 |
| షోడశకుమారచరిత్రము | 1-14-6 |
| హంససందేశము | 0- 4-6 |
| రాయవాచకము | 2-12-6 |
| సింహాసనద్వాత్రింశిక 1 భా | 3- 8-0 |
| డిటో 2 భా | 3- 8-0 |
| నిఘంటుచరిత్రము | 0-11-0 |
| ఆంధ్రకౌముది | 3- 2-6 |
| బాలభారతము | 24-10-9 |
| Dravidian Lexicography | 0-7-0 |
| Defence of Literary Telugu | 0-15-6 |
| చాటుధారాచమత్కారసారః | 2- 0-3 |
| సాంబోపాఖ్యానము | 0-14-6 |
| రసార్ణవాలంకారము | 1- 2-3 |
| కవిజనోజ్జీవని సమస్యలు | 0-14-3 |
| రఘునాథరామాయణము | 1-12-6 |
| రజతోత్సవసంపుటము | 3- 2-6 |
| ఆంధ్రసాహిత్యపరిషద్వృత్తాంతం | 0-14-3 |
| అరవదేశమునందలి ఆంధ్రవాఙ్మయం | 2- 4-6 |
| లౌకికన్యాయవివరణము | 1- 6-3 |
| లక్షణసారసంగ్రహము | 3-10-0 |
| కావ్యాలంకారచూడామణి పాఠభేదములు | 0- 9-0 |
| ఉత్తరరామచరిత్రము | 4-12-6 |
| శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు 1 భా | 158- 8-0 |
| 2 భా | 136- 4-0 |
| 3 భా | 185-12-0 |
| అమరుకము | 5- 0-9 |
| చంపూరామాయణము | 2-12-6 |
| ఆంధ్రవాఙ్మయవికాసశేఖరి | 8- 3-6 |
| బాలరామాయణము | 0- 1-9 |
| సీతారామచరిత్రము | 0- 7-3 |
| పరిషత్పుస్తకభాండాగారము 3 భా | 0-13-3 |
| | 687-15-0 |

# ఆంధ్రసాహిత్యపరిషత్తు - ప్రోత్సాహకులు.

శ్రీ శ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు
పిఠాపురంమహారాజావారు, పరిషద్వ్యవస్థాపకాధ్యక్షులు.

శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు-ఉయ్యూరు జమీందారువారు.

## అధ్యక్షులు

సాహిత్యవిశారద, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

## కార్యదర్శులు.

కిడాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు, ఎం. ఏ., (సహాయకోశాధ్యక్షులు.)

## కార్యనిర్వాహక సభాసభ్యులు

శ్రీ దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారు,
(కోశాధ్యక్షులు)

,, పిల్లారిశెట్టి రంగబ్రహ్మారావునాయుడుగారు.

,, కోటా శివనాధశాస్త్రిగారు.

,, కొమ్మిరెడ్డి కేశవరామమూర్తినాయుడుగారు, బి. ఏ.

,, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

,, నిడుదవోలు వేంకటరావుగారు, ఎం. ఏ.

,, ఏలేశ్వరపు వెంకటరమణసుబ్బారావుగారు, బి. ఏ., బి. ఎల్.

,, ప్రతివాదిభయంకరం పార్థసారధిగారు, బి. ఏ., ఎల్. ఎల్. బి.

,, కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.

,, కేశవరపు కామరాజుగారు.

,, వేదుల శ్రీరామచంద్రకీర్తిగారు ఎమ్. ఏ. (ఆనరసు)

# శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు

## చతుర్థసంపుటము.

శ్రీ పిఠాపురము మహారాజావారి ధనసహాయముచే బడుచున్న పెద్దనిఘంటువులోని రాయల్ సైజు 1000 పుటలు సంపుటమును, 955 పుటలుగల రెండవసంపుటమును, 980 మూడవసంపుటమును, 975 పుటలుగల చతుర్థసంపుటమును తయారై విక్రయమునకు సిద్ధముగానున్నవి. ఇందు ప్రథమసం అకారము మొదలు, ఔకారము వఱకునుగల యచ్చులాదియగు సంస్కృతాంధ్రశబ్దములన్నియుఁగలవు రెండవసంపుటమున 'క' 'జ' వఱకుఁగల శబ్దములును, తృతీయసంపుటమున 'ద' మొదలు వఱకుఁగలశబ్దములును, చతుర్థసంపుటమున '[illegible]' మొదలు '[illegible]' గల శబ్దములును గలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నిటి సర్వవిధముల నుత్తమమయినది. ఈపుస్తకమును రచియించుటకు చుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకే గాక జనసామాన్య కూడ లభ్యముగా నుండవలయు నను తలంపుతో నీక్రింది వె యుంచఁబడినవి. ప్రథమసంపుటము సాదాప్రతి వెల రు 5 లు, (Art Paper) రు 7 లు, ద్వితీయసంపుటము సాదాప్రతి మేలుప్రతి రు 5 లు, తృతీయసంపుటము సాదాప్రతి రు 4 ప్రతి రు 5 లు, చతుర్థసంపుటము సాదాప్రతి రు 4 లు, రు 5 లు.

---

Printed by N. Achutaramiah at the Cocanada Printing Cocanada, and Published by K. Raghavacharyulu, Secretary Academy, Cocanada.